# మహాభక్త అన్నమాచార్య

(నాటకము)



This Book is Published with the
Financial Assitance of
**Tirumala Tirupati Devasthanams**
under Aid to Authors Scheme

—: రచన :—

గూడూరు చిన్నపెంచల్‌రాజు

తాళ్ళపాక.

# మహాభక్త అన్నమాచార్య

(నాటకము)

తేది 5-1-1995

ప్రతులు : 1000

వెల : 20 రూపాయలు

ప్రతులకు
గూడూరు చిన్న పెంచల్‌రాజు
తాళ్ళపాక (వయా) మన్నూరు,
రాజంపేట మండలం,
కడప జిల్లా, పిన్ : 516 126

ముద్రణ :
శ్రీ గౌరీశంకర్ ప్రింటర్స్
మెయిన్‌రోడ్, రాజంపేట
కడప జిల్లా.

మహాభక్త అన్నమాచార్య నాటకము

# అంకితము



చ॥ స్థిరముగ నొక్కచోట, సిరి చిక్కి వసింపగ నోపదంట, ఆ
తెలగునె, భూ సతీమణియు దిర్దిర దిర్గుచు నుండునంట, యే
తెలగున వారితోడ తమిదీర సుఖింతువు శ్రీనివాస! ఆ
కొఱత దొలంగగా నిడితి గొన్మిదె నాదగు కావ్యకన్యకన్.

రచయిత

# కృతికర్త వంశవృక్షము

కులము : క్షత్రియ, గోత్రము ఆత్రేయసగోత్రము, యింటిపే
వంశీకుల స్వగ్రామము తాళ్ళపాక

నాకుతెలిసినంతవరకు

1. గూడూరు చలపతిరాజు వీరి భార్య : రాములమ్మ

సంతానము

,, (1) పెంచురాజు (2) చలమరాజు (3) నాr

2. గూడూరు పెంచురాజు భార్యపేరు : రంగమ్మ

సంతానము

1) గరుడరాజు మట్లిరాజుల పరిపాలనా వ్యవస్థలో, ఆ
పెందిన తవర్జీదారు
2) కొండలరాజు 3) నరసరాజు 4) సిద్ధిరాజు

3) గూడూరు కొండలరాజు భార్యపేరు సీతమ్మ

సంతానము

1) పెద్ద పిచ్చిరాజు, మంచిపురాణ ప్రవాచకులు వక్త ఆధ్యా
2) పిచ్చమ్మ 3) చిన్న పిచ్చిరాజు

4) గూడూరు పెద్ద పిచ్చిరాజు భార్యపేరు ఈశ్వరమ్మ
సంతానము : 1) సుబ్బమ్మ 2) నరసమ్మ 3) పెద్ద పెం
4) చిన్న పెంచలరాజు ప్రస్తుత కృతికర్త

5) గూడూరు చిన్న పెంచల్‌రాజు భార్యపేరు : సుబ్బమ్మ
సంతానము 1. సరోజనమ్మ 2. సరస్వతమ్మ

# కృతికర్త



కృతికర్త పేరు : గూడూరు చిన్న పెంచల్ రాజు

వీరి ధర్మపత్ని : గూడూరు సుబ్బమ్మ

జననము : 1-7-1929, తాళ్ళపాక

నివాసము : తాళ్ళపాక

వృత్తి : సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుడు

అభిరుచులు : కవిత్వము, కళారాదన

ఇతరకృతులు : కందరామాయణం, మరియు ఇతర లఘుకృత
చెక్కభజన కీర్తనలు.

తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభా అవార్డు గ్రహీత
స్వర్ణకంకణ విభూషిత
కవిసుధాకర-గానకళాధర
ఉపన్యాస రత్నాకర

## ఎంస్. రాజన్నకవి

ప్రొద్దుటూరు-516 360.
(కడపజిల్లా.)

**తేది 30-1-95**

## అభినుతి

తెలుగు సాహిత్యరంగంలో కవిత్వం, నవల, కథ చాలా అభివృద్ధి సాధించాయి, నాటకం మాత్రం ఇంకా వెనుకబడి ఉంది కారణం కాలమే నిర్ణయించాలి. ఇట్టిపరిస్థితుల్లో శ్రీ గూడూరు చిన్న పెంచలరాజుగారు 'మహాభక్త అన్నమాచార్య' నాటకం రచించడం సాహసమే!

తక్కిన పౌరాణిక నాటకాలవలె అన్నమయ్య నాటకం బహుళ ప్రచారానికి నోచుకోలేదు. ఊరూరా ఈ నాటకం ఎక్కువసార్లు ప్రదర్శించక పోవడమే కారణం కావచ్చు.

కవి ఈ నాటకంలో సన్నివేశాలను, సంభాషణలను ఎంతో సహజంగానడిపించాడు. అన్నమయ్య పదాలను యథా తథంగా చేర్చడం చాలా సముచితంగా ఉంది.

నాటక రచయిత శ్రీ రాజుగారు హృద్య పద్య పక్షపాతి రామాయణమంతా కందపద్యాల్లో రచించారు. నాటకంలోని పద్యాలు ధారాశుద్ధితో సరసంగా సాగిపోయాయి. ప్రధానంగా సీసపద్యాలు సంగీతపు నాటికకు బాగా ఒదిగివస్తాయి.

ఒక్కపద్యంవ్రాస్తే తిక్కన్న నాకంటే గొప్పవాడా! అనుకుంటున్న కవులు పొరాడుతున్న ఈ రోజుల్లో శ్రీ రాజుగారి వినయం వసంత సంధ్యా సమయం.

ఈ నాటకం ప్రదర్శనల ద్వారా తప్పక ప్రచారానికి వస్తుందని ఆశిస్తున్నాను.

# అభిప్రాయం

ఆడింది ఆటగా, పాడింది పాటగా శ్రీ వేంకటేశ్వరుని అర్చించి తరించిన పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు.

అన్నమయ్య కీర్తనల పరిష్కరణ, స్వరసంయోజన, ప్రచురణాది కార్యక్రమాలు నానాటికీ విస్తృతమవుతున్నాయి.

అన్నమయ్య జీవితగాథ పలురూపాలలో, పలుభాషలలో వెలువడుతుండటం హర్షణీయం.

మహాభక్త అన్నమాచార్య నాటకకర్త శ్రీ గూడూరు చిన్న పెంచల్ రాజు తాళ్ళపాక వాస్తవ్యుడు. ఉపాధ్యాయుడుగ విద్యార్థుల మన్నన లందుకొన్నవాడు కందరామాయణ గ్రంథకర్తగ పేరుగాంచినవాడు.

ఈ నాటకములో పద్యాలు ఎక్కువగాను, సంభాషణలు దీర్ఘంగాను ఉన్నాయి.

అన్నమయ్య పదాలను సంధర్భోచితంగా చేర్చటం రచయిత అభిరుచికి నిదర్శనం

వాగ్గేయకారుడైన అన్నమయ్య చరిత్రను దృశ్యకావ్యంగా రూపొందించిన శ్రీ పెంచల్‌రాజుగారిని అభినందిస్తున్నాను.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి
మాజీజిల్లా రచయితల సంఘం అధ్యక్షుడు కడప.

# అభినందన

శ్రీ చినపెంచలరాజుగారు భావుకులు, ఆయన తాళ్ళపాకలో జన్మించిన ధన్యజీవి. తాళ్ళపాకలో జన్మించడమే దుర్లభం. అచటపుట్టిన చిగురు గొమ్మైన చేవ అన్నట్లు తాళ్ళపాకలో జన్మించడం అదృష్టం. రాజుగారు చక్కటి కవిత్వం అల్లగలరు. అన్నమయ్య ఆ గ్రామంలో జన్మించి దైవాంకితంగా వేలాది కీర్తనలు రచించిన మహానుభావుడు. ఆయన జీవితాన్ని ఏడు అంకాల నాటకంగా మలచారు.

నాటకాంతం సాహిత్యం అన్నారు పెద్దలు. రాజుగారి కృషి ప్రశంసనీయం. ఎడనెడ అన్నమయ్య కీర్తనలు జోడించి కథాగమనం సుగమం చేశారు. పద్య రచనలో మెళుకవలు తెలుసుకొని వ్రాయడం కష్టం. ఆపని ఈ నాటకకర్త చేశారు. వార్ధక్యంలో అన్నమయ్య, స్వామికి తన ఆవేదన వెళ్ళబోసుకొన్న తీరు రమణీయం. కనులు చెమరించక తప్పదు. అన్నమాచార్యోదాహరణంలో పద్యాన్ని ఆ రవితారకంబుగ యథాతథంగా ఉటంకించారు. నాటకం ప్రదర్శన యోగ్యంగావుంది. రచయిత కృషి అభినందనీయం.

అనంత పద్మనాభరావు
స్టేషన్ డైరెక్టర్
ఆల్ ఇండియా రేడియో,
కడప – 516 001.

25-1-95

"అవధాన చక్రవర్తి"
"శతావధాన సార్వభౌమ"
డా॥ వేంగసాని మోహన్, ఎం.ఏ; పిహెచ్.డి;
డైరక్టర్, అన్నమాచార్య ప్రాజెక్ట్, తి.తి. దేవస్థానములు.

తిరుపతి
14-2-95

# అభినందన

మహాభాగవతోత్తముడైన "శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రను" ద్విపదకావ్యంగా వారి మనుమడు శ్రీ తాళ్లపాక చిన్న తిరువేంగళనాధుడు (చిన్నన్న) రచించాడు ఈ ద్విపదకావ్యం ఆధారంగా అన్నమాచార్యుల జీవిత చరిత్రను తిరుమల తిరుపతి దేవస్థానం వారు విపుల పీఠికతోను, గేయకథారూపంగాను, వచన కావ్యంగాను, బాలభారతి ప్రచురణగాను పలుమార్లు ప్రకటించి అన్నమాచార్య సాహిత్యాభిమానుల, భక్తుల మన్ననలు చూరగొనిరి, మరియు ఎందరో పండితులు, భక్తులు, పరిశోధకులు కూడ ఈ మహాభక్తుని చరిత్రను రచించి స్వయంగా ప్రకటించారు.

మహాభక్తుల చరిత్రలు నిత్యం పఠన, ప్రదర్శన యోగ్యమైనవి. "మహాభక్త అన్నమాచార్య" అను నాటకాన్ని తాళ్లపాక గ్రామస్థులైన శ్రీ గూడూరు చిన్న పెంచల్‌రాజుగారు రచించి ప్రకటించడం హర్షణీయం. తాళ్ళపాక అన్నమాచార్యుల జన్మస్థలవాసులు ఈ నాటికి ఆ మహాభక్తుని ఋణం తీర్చుకొన్నారు.

రచయిత చిన్నన్న ద్విపదను క్షుణ్ణంగా అధ్యయనం చేసినాటక రూప కల్పనకు తగిన సరంజామాను సమృద్ధిగా సమకూర్చుకొని కృతకృత్యులయ్యారు.

ప్రదర్శనానుగుణమైన సన్నివేశరూప కల్పన, సంక్షిప్తత చెప్పుకోతగినది. నాటకానికి అనుగుణంగా సందర్భోచితమైన కీర్తనలను పొందుపరచారు. ఈ నాటకంలో అన్నమయ్య సహవిద్యార్థులైన రామశర్మ బ్రహ్మశాస్త్రి పాత్రధారులచే ప్రేక్షకులకు (పాఠకులకు) హాస్యాన్ని అందించారు రచయిత. (చూపుట.-41)

అమలిన దివ్యశృంగారాన్ని గూర్చి రచయిత తిమ్మక్క ద్వారా ఎంతో ఉదాత్తంగా వినిపింపచేశారు (పుట-47)

దొంగ పాత్రధారిగా రోశయ్యను (పుట-43) ప్రవేశపెట్టడం ప్రత్యేకతే! రోశయ్య స్వామివారి విగ్రహాలను దొంగలించి ఆవేదన చెందినపుడు అన్నమయ్యద్వారా సామ్యవాద దృక్పథాన్ని వినిపింపచేశాడు రచయిత సాళ్వనరసింహరాయల ఆజ్ఞను అన్నమయ్య ధిక్కరించిన సన్నివేశంలో వారిరువురి మధ్య మధురభక్తి శృంగారాన్ని గూర్చిన చర్చ సందర్భంగా రచయిత పద్యాలను మనోజ్ఞంగా అల్లి తమ ప్రావీణ్యతను చాటుకొన్నారు.

ఈ నాటకంలోని భాష సరళం. శ్రీ రాజుగారు పాత్రోచితమైన శైలిని అనుసరించి నాటకానికి వన్నె తెచ్చారు.

అన్నమాచార్యుల మహిమలను (పుట-55) సాళ్వనరసింహరాయల పాత్ర ప్రవేశించడంలోను కథ మార్పులకులోనైనది.

పదకవితా పితామహుడైన శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రను నాటకంగా రచించిన శ్రీ గూడూరు చిన్న పెంచల్‌రాజుగారు అభినందనీయులు.

**వేందసాని మోహన్**
అన్నమాచార్య ప్రాజెక్ట్,
టి.టి.డి. తిరుపతి.

## మహాభక్త "అన్నమాచార్య" నాటకము ముద్రణ ఖర్చులకుగాను ఉదారముగా విరాళములు యిచ్చిన దాతలు

| | | | |
|---|---|---|---|
| మందపల్లె సుబ్బరామరాజు | డాక్టరు. | తాళ్ళపాక | 120/— |
| బాట్రాజు రంగరాజు | | కడప | 120/— |

### 116-00 రూపాయలు చందా ఇచ్చినవారు

| | | |
|---|---|---|
| ఆళ్ళగడ్డ పెంచల్‌రాజు | సర్పంచ్ | తాళ్ళపాక |
| గూడూరు చిన్నరంగరాజు | లెక్చరర్ | తాళ్ళపాక |
| గూడూరు యానాదిరాజు | | ,, |
| నూకా గంగిరెడ్డి | మాజీ సర్పంచ్ | ,, |
| చొప్పా శంకరరెడ్డి | | ,, |
| గోపువరం రామిరెడ్డి | | ,, |
| సోమినేని వెంకటసుబ్బయ్యనాయుడు | | ,, |
| బొట్టా రామయ్యనాయుడు | | ,, |
| ఉద్దండం బ్రహ్మయ్య | | ,, |
| బొమ్ము ప్రభాకరగౌడు | | ,, |
| సాధురామ ప్రసాదు | | మదనగోపాలపురము |
| సాధువిశాలక్ష్మమ్మ (భర్త S. V. కృష్ణయ్య జ్ఞాపకార్థం) | | ,, |
| కొండూరు శివరాజు | సర్పంచ్ | రాచపల్లె |
| నగళ్ళపాటి బలరామరాజు | | ,, |
| సంగరాజు పిచ్చిరాజు | | ,, |
| మూకా రామమోహనరెడ్డి | | ఇసుకపల్లె |
| పి. జయచంద్రరాజు | | హేమాద్రివారిపల్లె |
| కె.వి. సుబ్బారెడ్డి | డాక్టరు | రాజంపేట |
| ఎస్. మౌలానాసాహెబ్ | | ,, |
| ఫర్మిశెట్టి వేంకటసుబ్రమణ్యం | | ,, |
| వెన్నూరు సుధాకర్ | డాక్టరు | ,, |
| ). కుమార స్వామిరాజు | డాక్టరు | ,, |
| ముద్రగుడి రాఘవేంద్రవర్మ | డాక్టరు | ,, |
| )ల్చూరు కిశోర్‌బాబు (తండ్రి నాథమునిశెట్టి జ్ఞాపకార్థం) | | ,, |
| కొదరి బాదర్‌మల్ బవర్‌లాల్ (పసుపుమండి) | | రాజంపేట. |

## 58-00 రూపాయలు చందా ఇచ్చినవారు

బాట్రాజు సోమిరాజు, తాళ్ళపాక
బొగ్గరపు బశ్శెట్టి, రాజంపేట.
నారాయణ వేంకటసుబ్బయ్యశెట్టి అండ్ సన్స్, రాజంపేట.

## 50-00 రూపాయలు చందా ఇచ్చినవారు

| | |
|---|---|
| బాట్రాజు వెంకటసుబ్బరాజు (కొమ్మూరు) | తాళ్ళపాక |
| రుద్రరాజు నరసింహరాజు | ,, |
| ఆళ్ళగడ్డ జయచంద్రరాజు | ,, |
| జవ్వాజి నాగయ్య | ,, |
| జవ్వాజి శివయ్యగారి వేంకటయ్య | ,, |
| శ్యామన బోయిన సుదర్శన | ,, |
| గుండ్లపల్లె వరలక్ష్మమ్మ | మదనగోపాలపురం |
| నగళ్ళపాటి రామరాజు | ,, |
| కొండూరు సుబ్బరామరాజు | రాచపల్లె |
| అద్దేపల్లె రాధాకృష్ణంరాజు | ,, |
| అద్దేపల్లె తిమ్మరాజు | ,, |
| సంగరాజు వేంకటసుబ్బరాజు | ,, |
| గాదిరాజు ఈశ్వరరాజు | ,, |
| కుర్రా వేంకటసుబ్బయ్య | ఇసుకపల్లె |
| మన్నూరు వేంకటసుబ్బారెడ్డి | ,, |
| కె.వి. రమణయ్య | రాజంపేట |
| గొబ్బూరు వేంకటసుబ్బయ్య | ,, |

# నివేదన

నేను 1978 వ సం॥ములో 'కందరామాయణాన్ని' రచించి ముద్రణ చేయించితిని, తర్వాత ఏవేవో కొన్ని లఘుకవితలు తప్ప కావ్యరూపములో వ్రాయడము జరుగలేదు ఒక్కకావ్యముతోనే సరిపెట్టినావే, ఇంకేదైనా కావ్యాన్ని వ్రాయకూడదా! అని మిత్రులు, శ్రేయోభిలాషులు అనడంతోను మరియు అందుకుతోడుగా రాజంపేట నివాసి ప్రముఖన్యాయవాది ప్రస్తుత T.T.D. చేర్మన్ గారైన శ్రీ ఆకేపాటి చంగల్‌రెడ్డిగారు నా కందరామాయణాన్ని చూచి చాలాసంతోషించి రాజంపేటలో నాకు సన్మాన కార్యక్రమం తన స్వంతఖర్చులతో ఏర్పాటుచేసి, రాజంపేట R.D.O. గారిచే సన్మానం జరిపించినారు. సన్మానము జరుపుటేగాక నాకు తద్వారా ప్రోత్సాహమిచ్చి ఈ "మహాభక్త అన్నమాచార్య" అను నాటక కావ్యాన్ని వ్రాయుటకు దోహదము చేసినారు. గాన వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు

ఈ కావ్యాన్ని రచించడములో శ్రీ అన్నమాచార్యులవారి మనుమడైన శ్రీ తాళ్ళపాక చిన్నన్నగారు ద్విపదలోరచించిన "శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య చరిత్ర"ను ఆధారంగా తీసుకొనడమైంది. అందులో అచ్చటచ్చట సందర్భమునుబట్టి శ్రీఅన్నమాచార్యులవారు మరియు వారిసంతతివారు వ్రాసియున్న కీర్తనలను, శతక పద్యములను కొన్నింటిని మాత్రం తీసికొని తక్కిన కావ్యాన్ని పూర్తిచేయడం జరిగింది. మరియు ఇతర ప్రముఖులు వ్రాసిన శ్లోకములు కూడా కొన్నింటిని సందర్భాన్నిబట్టి వాడడమయింది.

ఈ కావ్యరచన చేయుడములో చిరంజీవి చెర్లోపల్లె వాస్తవ్యులు అయిన శ్రీ సంగరాజు వెంకట సుబ్బరాజుగారు నాకు చాలా సహకరించినారు తాను హిందీ పండిటుగా పనిచేయుచున్న తాళ్ళపాకలోని జిల్లా ప్రజాపరిషత్తు హైస్కూలు నందలి పుస్తక బాండాగారమునుండి వలసిన విషయములను సేకరించుటలోను, కథను నడిపించుటలోను, తగిన తోడ్పాటు యిచ్చినందుకు వారికి నా కృతజ్ఞతలు

ఈ కావ్యరచనలోని మంచి చెడ్డలను గమనించి తగిన సలహాలనిచ్చి

ప్రోత్సహించిన శ్రీ కట్టానరసింహులు (తెలుగు
కార్యక్రమములో శ్రమకోర్చి తప్పులను
గురురాజారావుగారికి, ముద్రణ ఖర్చుల నిమిత్తము
అందించిన T.T.D. సంస్థకు, ఆ సంస్థ చైర్మన్
చంగల్‌రెడ్డిగారికి, E. O. గారికి తక్కువ పడిన
యిచ్చిన దాతలకు ఆ విరాళములను సేకరించుటలో
పెంచల్‌రాజుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతా

ఈ కావ్యముపై అడిగినంతనే వారి
ప్రాయాలను అందించిన ప్రముఖకవులకు, పండిత
ముద్రించి ఇచ్చిన A. గణేష్, శ్రీ గౌరీశంకర్
నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు. కా
గ్రంధకర్తవి. కాని ప్రదర్శించ దలచువారు
సంతోషింతును.

ఇట్లు

గూడవారం

# ప్రార్ధన

సీ॥ విఘ్నేశ్వరుని గొల్చి విఘ్నముల్ దొలగంగ
చదువులమ్మను దల్చి పదముఅమర
ఇలు వేల్పు నరసింహు నింపొంద మదినిల్పి
ఇష్టదైవంబైన యీశుదలచి
వాల్మీకి మొదలైన వన్నె కెక్కిన యట్టి
సంస్కృత కవులను సన్నుతించి
నన్నయాది కవుల నెన్నియు మదిలోన
తెలుగు కవుల తృప్తిదీర వేడి

ఆ.వె॥ తాళ్ళపాక కవుల దలపోసి హృదయాన
తల్లి దండ్రి గురుల నెల్ల మ్రొక్కి
అన్నమార్య జీరి యాతని చరితమ్ము
నాటకముగ వ్రాతు నీటు మీర

# మహాభక్త అన్నమాచార్య

(నాటకము)

## పాత్రలు

1) బాల అన్నమయ్య — వయస్సు 12 సం॥లు
2) అన్నమయ్య — వయస్సు 30 సం॥లు
3) తిమ్మక్క — అన్నమయ్య భార్య
4) నారాయణ సూరి : అన్నమయ్య తండ్రి వ॥ 45 సం॥లు
5) లక్కమాంబ : నారాయణసూరి భార్య ॥ 35 సం॥లు
6) రామశర్మ }
7) బ్రహ్మశాస్త్రి } నారాయణసూరి శిష్యులు
8) తిరుపతి స్వామి }
9) మాధవయ్య } యాత్రికులు
10) ఘన విష్ణువు : వైష్ణవ మఠాధిపతి
11) అర్చకుడు : తిరుమల మందిరపూజారి
12) రోశయ్య : దొంగ
13) పురందరదాసు : కన్నడ వాగ్గేయ కారుడు వ॥ 55 సం॥
14) నరసింహరాయలు — టంగుటూరు పరగణాధిపతి
15) భటుడు : వయస్సు 20 సం॥లు
16) శ్రీ వేంకటేశ్వరుడు : తిరుమల వెలసిన శ్రీనివాసులు
17) పెద్దతిరుమలా చార్యుడు : అన్నమాచార్యుల కుమారుడు
18) చిన్న తిరుమలాచార్యులు : పెద్ద తిరుమలాచార్యుల జ్యేష్ట పుత్రుడు
19) చిన్నన్న (తిరువేంగళనాథుడు) : పె. తి. కనిష్ట పుత్రుడు

## ప్రార్థన

శ్రీ మత్వదీయ చరితామృత మన్నమార్యా
పీత్వాపినైవ సుహితా మనుజాభవేయు
త్వం వేంకటా చలపతే రివ భక్తి సారం
శ్రీ తాళ్ళపాక గురుదేవ నమో నమస్తే

## ప్రథమాంకము

(పెద్ద తిరుమలా చార్యుని స్వగృహము-తిరుపతి)
(శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ అన్నమాచార్యుల చిత్రపటములు ప్రక్కప్రక్కల అమర్చబడి యుండును)

పెద్ద తిరు: స్వామీ వేంకటేశ! మా పరివారపు పెన్నిధీ! నీకివే నా వందనాలు!
పద్యం సీ॥ మాధవ! గోవింద! మధుసూదనాచ్యుత
వామన! ప్రద్యుమ్న వాసుదేవ!
కృష్ణ! దామోదర! కేశవ! శ్రీ ధర!
హరి! విష్ణు! పురుషోత్తమానిరుద్ధ!
సంకర్షణా ధోక్షజ! త్రివిక్రమ! పద్మ
నాభ! జనార్ధన! నారసింహ!
శౌరి! హృషీకేశ! నారాయణోపేంద్ర!
తాళంక ముఖనామ తాళ్ళపాక!
గీ॥ యన్నమాచార్య సుత తిమ్మయాహ్వయుండ
ప్రణుతి చేసితి జేకొమ్ము పద్యశతము!
కవిత లక్ష్మీశ సర్వజగన్నివేశ
విమల రవికోటి సంకాశ వేంకటేశ!

రేపే వైశాఖ పౌర్ణమి కీర్తిశేషులు తండ్రిగారు అన్నమాచార్యుల వారి జన్మదినము. కడు ఆనందోత్సవాలతో జరుపుకొనే జయంతి ఈ తిరుపతిలోను తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని సన్నిధియందును శ్రీనివాస మంగాపురం తదితర ప్రాంతాల పండితుల, అర్చకుల, గాయకుల, బ్రాహ్మణోత్తముల భక్తుల నాహ్వానించి ధన వస్త్రాదులు, దానము చేయవలె. విందుభోజనములతో జయంతిని కడువిందుగా చేయవలె. తండ్రీ! అన్నమాచార్యా! నేనేకాదు నీ మనుమలు కూడా మీవలెనే నాస్తిక వాదము ప్రబలే యీ యుగములో పామర జనావళి సైతము ఆడూతూ పాడుతూ ఆనంద పడేరీతిలో సంకీర్తనా రచనల చేసి భక్తి భావాన్ని నింపుతూ వేంకటరమణుని పూజిస్తూ వైష్ణవమే పరమావధిగా జీవిస్తున్నారు.

(సంగీతాలాపన వినబడుతుంది) అదిగో! ఏదో ఆలాపన (దూరంగా చిన్న తిరుమలా చార్యులు, చిన్నన్న పాడుతూ ప్రవేశం) తండ్రీ నీ పెద్ద మనుమడు చిన్న తిరుమలాచార్యులు, నీ చిన్న మనుమడు తిరువేంగళనాధుడు పిన్న వయసులో నీవు ముద్దుగా పిలిచేవాడివే "చిన్నన్నా" యని వాడే

తిరువేంగళ నాథుడు, అడుగో! ఇటేవస్తున్నాడు.

చిన్నన్న కీర్తన : అప్పని వరప్రసాది అన్నమయ్యా!
అప్పనము మాకే కలడన్నమయ్యా! ॥అప్ప॥

చిన్న, తిరు: అంతటికి నేలికైన ఆదినారాయణు తన
అంతరంగాన నిలిపే నన్నమయ్యా
సంతసాన వెలుగొందె సనకస నందనాదు
లంతటివాడు తాళ్ళపాక అన్నమయ్య ॥అప్ప॥

చిన్నన్న అందమైన రామానుజాచార్య మతమును
అందుకొని నిలిచి నాడన్నమయ్యా
విందువలె మాకును శ్రీవేంకటనాథునియిచ్చె
అందరిలో, తాళ్ళపాక అన్నమయ్యా ॥అప్ప॥

చిన్నన్న-చిన్న, తిరు : నాన్నగారికి నమస్కారములు

పెద్ద తిరు : ధీర్ఘాయుష్మాన్భవ! కుమారా! చిన్న తిరుమలయ్యా! ఏమిటి విశేషము?

చిన్న-తిరు : తండ్రీ! మా తాతగారు శ్రీ అన్నమాచార్యులు తాళపత్రములపై రచించిన కీర్తనలన్నింటిని రాగి రేకులపై చెక్కించి స్వామివారి ఆలయాన గల భాండారమున భద్రపరచు కార్యక్రమము సక్రమముగనే జరుగుచున్నది. తిరుమలలో మన యింటిముందు మండపము తదితర మంటప నిర్మాణములు పూర్తియైనవి. మీ పర్యవేక్షణలో స్వామి పుష్కరిణి జీర్ణోద్ధరణ, మెట్లు ఇంకనూ జరుగవలసి యున్నది.

పెద్ద తిరు : ఔను ఇంకనూ ఎన్నో కార్యములు కావలసియున్నవి. అందుకే మనవిగా యున్న కావనూరు కుప్పము కిళంగున్నము, మన్నసముద్రము పూండి, సంగమకోట, రాయలపాడు పల్లివరము మొదలగు గ్రామాలను ఎగువ, దిగువ తిరుపతులలో యున్న దేవాలయాలకు, ఉత్సవ నైవేద్యాలకై వంశపారంపర్యంగా మనపేర జరిపించుటకై శాశ్వత యేర్పాట్లు చేయించదలచాను.

చిన్న తిరు : తండ్రీ! నేను కూడా తాతగారివలె, మీ వలె వినూత్న రవళిలో పదకవిత లల్లుతూ ఆలపిస్తూ, రాగిరేకులపైన వానిని చెక్కిస్తూయున్నాను.

పెద్ద తిరు : చాలా సంతోషము భగవంతుని అందుకోవటానికి తొమ్మిది భక్తి మార్గాలున్నాయని భాగవతప్రతీతి అవి యేవన

శ్లోకం : శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥

ఇందు మా తండ్రిది సంకీర్తన మార్గము, మనము ఆదారినే వెళ్లి ముక్తి మార్గాన్ని అందుకొందాము. అయితే కుమారులారా! ఎప్పుడు ఏ కార్యము చేయదగునో అప్పుడే చేయవలయును లేకున్న వశముగావు.

పద్యము : సీ॥ అడుసు చేతుల దివియగ వచ్చునొకవేళ
జలిసిరెుందిన గడ్డపార వలయు
ఆకటి వేళనే యన్నంబు రుచియగు
దలిసెనె నోకి వింతలు గడంగు
దటితోడ విత్తిన దలచుగా బండుఁజే
నెపుడైన విత్తిన నీచపోవు
బంటు నాయావేళ బనిగొన వలెగాని
యలవాటు దప్పిన నడచివడును

గీ॥ వేళవేళల గార్యముల్ వెలయజేయ
వలయు నొంకయింత దప్పిన వశముగావు
కపిత లక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమల రవికోటి సంకాశ! వేంకటేశ!

చిన్న తిరు : తండ్రీ! తాతగారు సంస్కృతమున లక్షణగ్రంథము రచించి యున్నారు కదా! దానిని ఆంధ్రభాషలో "సంకీర్తన లక్షణము" యను పేర యనువదించాలని నాకు కోరికగాయున్నది. మీ యనుమతియైన,

పద్యము : ఆవె॥ అలరు దాళ్లపాక యన్నమార్య సుతుడు
తిరుమలార్యుడఖిల దేశికుండు
తత్సుతాగ్రజుండ ధరలోన జనతిమ్మ
యాహ్వయుండ దండ్రియను మతమున

తండ్రీ! తాతగారి లక్షణ గ్రంథము యెటువంటిదనగా .......

పద్యము : మ॥ ధరలో దాళమ పాకయన్నయ గుహూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మునుజేయ బూనితగనుత్పాదించె దల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబున గవీంద్రానంద సంధాయియై
పరిపూర్ణాఖిల శాస్త్ర సమ్మతముగా భావజ్ఞు తాతాననన్

చిన్నన్న : ఔను నాన్నగారూ, తాతగారి కవితారీతులు నాకును కడుగొప్ప
గను ప్రశంసారీతిగను నై యున్నవి.

పద్యము : మ॥ శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారమ్ములై
యతిలోకాగమ వీథులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకట శైలవల్లభరతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళమ పాకయన్నయ వచో నూత్నక్రియల్ జెన్నగన్

నాన్నగారూ! నాకును చాలా దినముల నుండి యొక కోరికయున్నది మీ
యనుమతి యైనచో......... ....

పెద్ద తిరు : ఏమిదది చిన్నన్నా!
చిన్నన్న : మీరును అన్నగార్లూ యెన్నో కీర్తనలను రచిస్తూ తాతగారైన
అన్నమాచార్యుల కీర్తిని పరి రక్షిస్తున్నారు. తాతగారి చరితను
కావ్యరూపేణా రంచించాలని, పామర జనంసైతం చదివి అర్థం
చేసికొనే రీతిలో పద్యకావ్యంగా వ్రాయాలని యున్నది. మరి
నాకు వయసు తెలిసీ తెలియక మునుపే తాతగారు స్వర్గస్థులైరి
వారిని గురించి పూర్తిగా తెలియదాయె, మీరు కథారూపేణా
చెప్పిన యెడల కావ్యరూపేణా తేగలను.

పెద్ద తిరు : మంచిది కుమారా! పెద్ద తిరుమలయ్యే పదమున కెఱుగున్
చిన్నన్న ద్విపద కెఱుగునుయని వేనోళ్ల పొగడ బడునట్లు
కావ్యరచన ప్రారంభించు, చూడు చిన్నన్నా! నీవడిగినట్లే నీకు
అన్నమాచార్యుల చరిత్రను నాదైన ధోరణిలో చెప్పెదను ఆలకించు

కడప మండలం (జిల్లా)లో తాళ్ళపాక యను గ్రామమున్నది
అందు మా తాతగారైన నారాయణ సూరి తన సోదరులతో కూడి
వ్యవసాయము జీవనాధారముగా జేసికొని జీవించేవారు. వారు
గొప్ప పండితులు వారి భార్యపేరు లక్కమాంబ మహాసాధ్వి

గొప్పభక్తురాలు ఆమె తల్లిగారి గ్రామమైన మాడుపూరిలోని 'మాధవమూర్తి' యను దేవుడు ఆ లక్కమాంబతో మాటలాడునని ప్రతీతి. ఆ దంపతులకు చాలాకాలము వరకు సంతాన భాగ్యము కలుగలేదు. అందుకామె ఒకనాడు సంతానార్థియై ఇష్టసిద్ధికొఱకు దేవుని ప్రార్థిస్తూ ఉంది.

(తెరవ్రాలును)

ద్వితీయ యాంకము (ప్రథమ రంగము)

లక్క : (తాళ్లపాక నారాయణసూరి స్వగృహము. లక్కమాంబ పీఠముపై అమర్చఁబడిన దేవునికి కొబ్బరికాయకొట్టి హారతియిచ్చి)

పా : శ్రీరమ మంగగాగ నలశేషుడు నొప్పగు శేషశైలమై
ధారుణి వేంకటేశు నవతారము నెత్తియు భక్తులన్ మహా
దారుణ పాప పంకిలము దాఱ్కొన నీయక ప్రోచుదేవు బెం
పారెడు భక్తితోడ మది నర్మిలి మ్రొక్కెద నిష్టసిద్ధికై

(నారాయణ సూరి ప్రవేశము హారతి కళ్లకు అద్దుకొనును)

లక్క : స్వాముల వారికి నమస్కారములు!

నా సూ : భద్రమస్తు దేవీ!

సంకటమ్ములు లేకుండ జరుగుబ్రతుకు
భక్తియుతమైన చిత్తమ్ము పరగగల్గి
సిరులు విద్యలు మనకెల్ల జేరియుంట
వేంకటేశుని కృపగాదె పంకజాక్షి!

మరియు

: సొంపుమీర నారాయణసూరి లక్క
మాంబలను బోలు దాంపత్యమవని గలదె
యనుచు మనలను బొగడంగ మనుచునుంట
వేంకటేశుని కృపగాదె పంకజాక్షి!

ఇన్నివిధముల స్వామి మనలను కాపాడు చుండ, మరల నేదియో ఇష్టసిద్ధిని కోరుచున్నట్లున్నదే?

: ఔను స్వామి! అంతయు ఆదేవుని దయవలన మనకు మంచియే జరుగుచున్నది, శివుని ఆజ్ఞలేనిదే చీమఅయినా కుట్టదందురు కదా!

నారా! మరి నీవు ఏదో దీనంగా "[మొక్కెద నిష్ట సిద్ధికై]" అని ప్రార్థించు చున్నావు కదా. ఈ సాంసారిక జీవితములోనే నేదైనా నిన్ను కష్ట పెట్టితినా?

కం॥ మనదగు దాంపత్యమ్మున
నిను మన్నన జేయకేసు నిలిచితె నొంటిన్
చెనకిరె దాయాదులు లే
క ననారోగ్యమ్మె నీకు కలిగెనె జెపుమా.

లక్ష్మి: స్వామీ! ఆ భగవంతుని దయవల్ల మీ ఆశీస్సులు అనురాగము ఆప్యాయతవల్ల నాకు యేలాటి కష్టాలు లేవు

గీ॥ అత్త మామలు మరదలు నాడపడుచు
లిరుగు పొరుగులతో బాధ లేమి లేవు
దేహ మారోగ్యవంతమౌ దెవులు లేక
నీదు కరుణను యాదేవు యాదరమున

కానీ నామనమున నొక కొరత .........

నారా: కొరతయా? ఏమిటా కొరత?

లక్ష్మి: స్వామి! "ఆడదానికి కడుపునిండిన కాదు సుఖము కడుపు పండిననే సౌఖ్యము" అన్న నానుడి మీరెరుగనిది కాదు. స్త్రీకోరేది ముఖ్యంగా రెండు, ఒకటి తన మాంగల్య భాగ్యము, రెండవది సంతాన సౌభాగ్యము.

ఉ : సంపదలెన్నియున్న భువిసాటియె నొక్క సుపుత్రుతోడ భా
వింపరె పుణ్యమంటదని పెద్దలు సంతతి కల్గకుండినన్
యింపుగ బెండ్లియై మనకు యెక్కువ కాలమెయయ్యెగాని పు
ట్టింపడు దైవమేలనొకొ యెగ్గుల నెయ్యెడ జేసి నారామో

నారా: దేవీ! చింతింపవలదు మనము సంతానహీనులము కాబోము. ఇంకనూ తల్లినికాలేక పోతినేయన్న బాధ నీ కుండుట సహజమే!

కం॥ : చింతిప వలదు దేవీ
సంతానము గల్గుమనకు జనములు బొగడన్
కాంతరో మా తండ్రికి మును
చింతలమయ జెప్పె సంతు జేకురుననుచున్

మన సంతాన విషయమై మా తండ్రికి ముందే చింతలమ్మ జోస్యము చెప్పియున్నది.

లక్క : ఎవరండీ! ఆ చింతలమ్మ? మీతండ్రిగారికి యెట్లు తటస్థించినది?

నారా : చెప్పెద వినుము మన గ్రామమైన ఈ తాళ్ళపాకకు దక్షిణమున కొంచెము దూరమున ఊటుకూరు అను గ్రామమున్నది కదా! అందు మన బంధువులున్నారని నీకు కూడా తెలుసు. మా తండ్రి నారాయణునకు తన వద్ద విద్యరాలేదని ఆయన తండ్రి విఠలుడు ఊటుకూరున గల తన బంధువుల కడకు చదువు నేర్చుకొనుటకై మా తండ్రిని బంపెనట!

లక్క : తర్వాత యేమి జరిగినది?

నారా : అచ్చటనూ మా తండ్రిగారికి విద్యరాలేదు, గురువులు కొట్టారు తిట్టారు, తన తోటి విద్యార్థులు గేలిచేశారు. బంధువులు విసుగు చెందారు. అప్పుడు ఆయన మనమున.......

గీ॥ తండ్రి నేర్పింప విద్యనా తలను జొరదు
బంధువుల కడనైన విద్యందదేమొ
తోటిపిల్లల యెగతాళి దొలగుటెట్లు
బ్రతుక నేటికి జచ్చుటే భావ్యమనుచు

అని ఆవిధంగా తలంచి తుదకు ఆత్మహత్య కావించుకొన యోచించి ఒకనాడు ఆ ఊరిలోని చింతలమ్మ దేవాలయమున గల పుట్టలోన చేయి దూర్చి సర్పముచే కఱపించుకొన దలచెనట.

లక్క : ఆహా! మామగారు ఎంతటి త్యాగము చేయ పూనుకొనిరి. పాము కాటువేసెనా ఏమి?

నారా : లేదు లేదు కరుణాలవాలయగు నా చింతలమ్మ మా తండ్రి గారికి ప్రత్యక్షమైనదట అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకి ఆది మధ్యాంతములు తానెయై నిలిచినది. ఆదిదేవుని అర్ధాంగికి అవగతము గానిదేముంటుంది. చెప్పు? ఆమె చిరునవ్వుతో మా తండ్రి నుద్దేశించి ఆత్మహత్య కన్న మిన్నయగు పాపమున్నదా? విద్య రాదని ఈ లోకమునే వీడ సాహసించితివా? అనెను! అప్పుడాయన "తల్లీ! విద్యరాని వింతపశువుగా జీవింపలేను. ఏ ముఖంపెట్టుకొని

తాళ్లపాకకు పోగలను. "తల్లీ నన్ను నీలో జేర్చుకో" అని మొర లిడెనట!

లక్క : ఆహా! మీ తండ్రిగారి బాల్యము కడు వింతగా జరిగినది స్వామి, పిమ్మట యేమైనది?

నారా : ఆ చింతలమ్మ దేవి కరుణించి మా తండ్రితో

సీ॥ బాలకా నీదగు బాధనెఱింగితి
భవితవ్యమెఱిగింతు భయము వదలు
నీదు స్వగ్రామమ్ము నిఖిల దేవుళ్లకు
ఆలవాలమ్ము నైయలరు చుండ
ఏల వచ్చితి విందు కిరవెరుంగని వాడ
చనవయ్య నచ్చోట ఘనత నొప్ప
చెన్నకేశవు భక్తి సేవించి విద్యల
నారితేరుదు వీవు నధికుడనగ

గీ॥ పరగ నీతోడ మూడవ తరమునందు
నొక్కమహనీయు డుద్భవమొందు జగతి
ఖ్యాతి రార్జించు నీ వంశ ఘనత బెంచు
విశ్వసించియు నామాట వెడలి పొమ్ము

అని చెప్పి అంతర్ధాన మొందెనట. తర్వాత మా తండ్రిగారు యీ తాళ్ళపాకకు విచ్చేసి చెన్నకేశవు సేవించి గొప్ప విద్వాంసుడయ్యె నట. నాతో రెండవ తరమైనది. ఇక మూడవతరము కానున్నది. కాన మనకు తప్పక సుపుత్ర ప్రాప్తి కలుగునని నా నమ్మకము చింతలమ్మ వాక్కు వృధాకాదు, కాన నీవు దిగులొందకుము.

లక్క : మహాభాగ్యము స్వామీ! ఆపద్రమొక్కులవాడు, అనాథరక్షకుడు, అడుగడుగు దండాలవాడు, యేడుకొండలవాడు, యీ కలియుగ ప్రత్యక్షదైవము అయిన వేంకటరమణుని ఒక్కమారు దర్శించి చింతలమ్మ వాక్కు తర్వగ సఫలీ కృతము చేయుమని వరపడి వేడుకొనవలయునని నామనంబునను నున్నది.

ఆ.వె॥ చింతలమ్మ వాక్కు శ్రీఘమ్మె ఫలియింప
వెంకటేశుదరికి వెళ్లిమనము
మ్రొక్కవలయు స్వామి ముంగిట వరపడి
దక్కవలయు మనకు తనయుడొకడు

నారా : అటులనే దేవీ! నీ కోరిక మేరకు కోరికలీడేర్చు ఆ వేంకటేశ్వర స్వామి దర్శనార్థమై రేపే ఆ కలియుగ వైకుంఠమైన తిరుపతికి పయనము గావింతము.

(ఇరువురు నిష్క్రమించెదరు. లక్కమాంబ నిండు గర్భవతిగా రంగమున ప్రవేశించును)

లక్క : (రంగమున గల ఎత్తుపీఠము పైనున్న వేంకటేశ్వరస్వామి విగ్రహమునకు నమస్కరిస్తూ)

స్వామీ వేంకటనాథా! నీ మహిమలద్వితీయములు కదా! ఎన్నో కష్టాలతో నీదరికి వచ్చి నినుగాంచి నినుపూజించి నీకడ వరపడిన నాకు కలలో కన్పించి నీ యొక్క బిరుదు గజ్జియల ముప్పిడి కఠారమొకటి యిచ్చితివి. దాని అర్థమేమిటో అంతరార్థమేమిటో యేమి మాయయో ఎంతటి మహిమయో నేను గర్భవతి నైతిని, నవమాసములు నిండినవి, నేటి ఉదయము నుండి యేదో బడలిక అప్పుడప్పుడు కడుపునందు నొప్పి వచ్చుచున్నది.

ఆ.వె॥ చింతలమ్మ మున్ను జెప్పిన జోస్యమ్ము
నిజముజేయదలచి నీరజాక్ష
ఖడ్గమొసగి తీవు గర్భమ్ము వచ్చెను
నెలలునిండె సుతుని కలుగజేయు

ఆ. అమ్మా అబ్బా గర్భమునందు యెక్కువ బాధగా నున్నది. ప్రసవవేదన కావచ్చును. మంత్రసానికొరకు పంపవలెను. అమ్మా లోనికేగి పరుండెదను. (లోనికేగును) (తెరవాలును. లేచును.)

## ద్వితీయ రంగము.

(నారాయణసూరి శిష్యులు 1 రామశర్మ 12 సం॥ 2 బ్రహ్మశాస్త్రి. 14 సం॥)

బ్రహ్మశ్రీ కూర్చొని తూగుతూ ఉంటాడు రామం వెనుక వచ్చి పిలకలాగుతాడు బ్రహ్మం ఉలిక్కిపడి మళ్ళీ నిద్రపోతాడు మళ్ళీ రామం పిలకలాగుతాడు బ్రహ్మం ఉలిక్కిపడుతాడు. ఈ విధంగా తమాషాపడుతారు)

బ్రహ్మ : అబ్బ. నీవతరా రామం మాంచి నిద్ర పాడుజేసినావురా వెధవా.

రామం : ఒరేయ్ బ్రహ్మం ప్రొద్దుచూడు యెంతయెక్కిందో. ఇంకాయేమిటి రా నిద్ర వెధవాలెయ్.

బ్రహ్మ : అదికాదురా ప్రొద్దున్నే నిద్రలేచి అల్పాహారం తిన్నాను (కడుపు చూపిస్తూ) కొద్దిగా యెక్కువ అయింది అంతే చదువుకొందామని కూర్చున్నానోలేదో ఒకేతూగు

రామం : అదికాదురా బొజ్జ తండ్రీ (అతని బొజ్జను తడుముతూ) ఈ చిన్ని కడుపుకు ఇంత ప్రొద్దున్నే యేమితిన్నావు ఎంతతిన్నావు అంతగా భుక్తాయాసం రావటానికి

బ్రహ్మ : ఏముంది యేదో కొద్దిగ (చేతులతో చూపిస్తూ) ఇంతే గిన్నెతో ఉప్పింది. కేవలం పదియిద్దెన్లు గోదుమరొత్తెలు అయిదు, చక్కెర పొంగలి యింత గిన్నెదు, రెండుపావులపాలు అంతేరా రామం.

రామం : అయ్యో....అయ్యో.... ఇది అల్పాహారమా! బొజ్జ తండ్రీ! (అని బ్రహ్మం బొజ్జ తడుముతూ) యిది కడుపా లేక హత్యరాల మడుగా అమ్మో ....అమ్మో... నీవు బ్రహ్మంకాదుర బ్రహ్మరాక్షసివి.

బ్రహ్మ : ఛీ..ఛీ ... నన్ను దిష్టి పెత్తకురా! దిష్టి తగుల్తుంది. నన్ను బ్రహ్మ రాక్షసి అంతావా? నాపేరు అంతేనా పూర్తిపేరు నీకు తెలీయదురా వెధవా! చెప్తావిను. వీర వేంకత నృసింహమాధవ సూర్య బ్రహ్మ శాస్త్రిరా

రామం : అమ్మో....అమ్మో నీతిండి నీపేరు వింటుంటె అబ్బ....అబ్బ.... నాతలకాయ బెండకాయ అయిపోతొందిరా బొంగరంలాగా తిరిగి పోతొంది.

బ్రహ్మ : ఒరే గేలిసేయకురా యెవరైనా వింతే నన్ను యెగతాలి చేస్తారు. నాకు కదుపులోమంత వస్తుంది.

రామం : కడుపుకాదురా వెధవా "కడుపు" మంతగాదురా "మంట" నీకు టుడ పలకడం ఎప్పుడు వస్తుందో యేమో.

బ్రహ్మ : సరేలేరా! యేదో ఒకటి. నాకు నాలుకమందమంత మా తాత చెప్పినాదు నోట్లో గులకరాళ్ళుకూడా వేసికోని తిప్పినాను నాలుక తెగింది కాని మాతలు అంతేరా ఏంచేసేదిరా. రామం.

రామం : ఒరేయి బ్రహ్మం ఒకపనిచెయ్ నాలుక పలుచగా వస్తుంది.

బ్రహ్మ : ఏమితో చెప్పరా బాబూ (రామం గడ్డంపట్టుకొని బంగపడుతాడు)

రామం : మాంచి యిటుక తీసికొని నీ నాలుకను ఇలా బయటికి తీసి ఆ ఇటుకను నాలుకపైన వేసి బాగా అరగరుద్దు. నాలుక బాగాపలు చనై పోతుంది.

బ్రహ్మ : వెధవా! (రామంనుకొట్టుతూ) నాకు తెలియదనుకున్నావ్ వెనకాల ఒకడు నీలాంతోదు చెప్పిన మాతవిని నల్లగా కట్టిగా ఉన్నవాదు ఇతుకతో ఒళ్ళుదుద్దుకున్నాదంత. అంతే నలుపురంగు పోలేదుగాని ఒళ్ళంతా పుండ్లు అయిపోయినాయంత, మా తాత చెప్పినాదు

రామం : సరేగాని ఈరోజు మన అన్నమయ్య........

బ్రహ్మ : సరేలేరా! నాకు అంతమతిమరుపు లేదులేరా మనగురువు నారాయణసూరిగారికి ఏడుకొండలవాని దయవలన కొదుకుపుత్తినాదని తెలుసు. వానికి అన్నమయ్య అని పేరుగూదా పెత్తినారు. మళ్లి యేమయింది?

రామం : చిన్నప్పుడు ఆ అన్నమయ్యకు మన లక్కమాంబ, దేవునిపాటలు పాడుతూ అన్నంతినిపించేది. మనకంటే చిన్నవాడైనా యిప్పుడు మాంచితెలివితేటలూ!

బ్రహ్మ : ఔను లేరా నాయనా! ఆ అన్నమయ్య (చేతుల్తోచూపిస్తూ) ఇంతై ఇంతై ఇపుదు ఇంతవాదైనాదు. పదిరెండు యేండ్ల వయసు. మొన్ననే కదా ఉపనయనము కూదా చేసినారు. ఆనాదు ఆహా! ఆ పిందివంతలు అబ్బో! నోరూరుతుందిరా!

రామం : అబ్బ తిండికథ మొదలెట్టవద్దు కానీ ఈరోజు మన గ్రామములో జరిగే చెన్నకేశవస్వామి ఉత్సవాలకై మనము అన్నమయ్యను తీసికొని దేవాలయానికి వెళ్లవలెనుకదా! పూలు పండ్లు కోసుకొని వచ్చితివా?

బ్రహ్మ : లేదురా (ఏడుపుముఖంతో) అవలేం జరిగిందంతే. నేను పూలకోసం సాయంకాలము మదుగుదగ్గరకు పోయాను. రకరకాల పూలుకోసు కున్నాను. ఎక్కదపోసుకొని మూత గట్టుకోవాల! అప్పుడు నాకు జ్ఞాపకము వచ్చింది, ఒరే! నేను చిత్తి తీసికొని రాలేదే, అని ఏం చెయ్యాల! అక్కడవున్న ఆకులు కొన్ని కోసి వాటిలోవేసి చిన్నగా మూతగట్టుకొని నెత్తిన బెట్టుకొని వస్తాఉన్నా, దారిలో ఒకకాలువ వచ్చింది. దానిని అత్తేయెగిరి దాతినా, అంతే నేను, పూలు, అన్ని ఆకాలువలో పడిపూలు కొట్టుకొని పోయినాయి. ఏం చెయ్యాల, తిన్నగాలేచి ఊరికే వచ్చినానురా.

రామం : ఓరి దద్దమ్మా (అనిపకపక నవ్వుతూ) నీతెలివి అంతేరా పూలకోసం పోయేవాడివి ఏదైనా బుట్టగాని సంచిగాని తీసికొనిపోవాలి గదా! అంతమాత్రం తెలియదా? ఆ ...ఆ ...అదుగో మన గురువుగారు వస్తున్నారు కూర్చో. కూర్చో.

(నారాయణసూరి ప్రవేశము. శిష్యులు ఇద్దరు లేచి నమస్కరిస్తారు)

రా,బ్ర : గురువుగారికి నమస్కారములు.

నారా : శుభోదయం శిష్యులారా! నిన్న మీకు చెప్పిన పాఠములో ముఖ్యమైన నీతివాక్యములను గుర్తించితిరా?

బ్రహ్మ : ఔను గురువుగారు ఒక్కనీతి వాక్యం నేను చెపుతాను.

నారా : చెప్పునాయన బ్రహ్మశాస్త్రీ.

బ్రహ్మ : సాగరానికి ఆతుపోతు లెత్తా వస్తాయో మనిషికి కత్తాలు సుఖాలు అత్లా వస్తూ ఉంతాయి.

నారా : రామారామ ఒరేయ్‌వెధవా! "ఆటుపోటులు" అన్నపదం నీనోటుబడి పరమ అసహ్యంగా తయారుఅయింది. ఆదేవుడు నీకు ఆబండ నాలుకను ఎట్లాయిచ్చినాడో! ఒరేయ్ బ్రహ్మశాస్త్రి! నిన్ను చూస్తుంటే ఒకప్రక్క కోపము ఒకప్రక్క నవ్వువస్తున్నది. ఒరేయ్ రామ శర్మ నీవైనా చెప్పరా? రెండవది,

రామం : మీరు చెప్పిన పాఠములోని నీతి "కుక్క విశ్వాసం గల జంతువు"

నారా : చాలా సంతోషం. సరిగానే చెప్పావు.

రామం : (తలగోక్కుంటూ) ఒక్కసందేహం గురువుగారూ. ఉదయాన

ఒకకుక్క వీధిలో పరుగెత్తుతోంది. వెనకాల నాలుగైదు కుక్కలు పరుగెత్తుతున్నాయి. కుక్క విశ్వాసంగల జంతువుకదా? మరి ముందు పరుగెత్తే కుక్కకు వెనకాల పరుగెత్తేవాటి పైన విశ్వాసము లేదా? ఎందుకు అట్లామొరుగుతుంది చెప్పండి గురువుగారు?

నారా : (తలపట్టుకుంటూ) చొప్పదంటు ప్రశ్నలు స్వామీ చెన్నకేశవా! ఒకడేమో బండమొద్దు! ఇంకొకడేమో అతివాగుడు! వీళ్లకు విద్యా బుద్ధులు నేర్పాలంటే యేసరస్వతియో బృహస్పతియో రావాలి, గాని నాబోటివానికి సాధ్యమౌతుందా?

(అన్నమయ్య ప్రవేశము)

అన్న : తండ్రీ! వందనము!

నారా : రా అన్నమయ్యా, దీర్ఘాయుష్మాన్ భవ.

అన్న : మీరు నిన్న చెప్పిన ఉపనిషద్శ్లోకాలను వల్లించెదను.

నారా : చెప్పుకుమారా!

అన్న : శ్లో॥ అన్నమయ ప్రాణమయ మనోమయ
విజ్ఞానమయా నన్దమయా
శరీరామే శుధ్యన్తాం జ్యోతి రహం
విరజా విపాప్మా భూయాసమ్

(లక్కమాంబ ప్రవేశము)

నారా : ఆ శ్లోకము యొక్క భావమేమిటో చెప్పగలవా?

అన్న : చెబుతాను తండ్రీ! "నాలోయున్న ఆహార సంబంధమైన మన! సంబంధమైన విజ్ఞాన సంబంధమైన ఆనందమయమైన శరీర ములు శుద్ధములు అగుగాక, నేను జ్యోతి స్వరూపుడను, రజోగుణం లేశమైనను లేనివాడను, పాపరహితుడను, అగుదునుగాక" యని ఆ శ్లోకం యొక్కభావము.

లక్క : బాబూ! అన్నమయ్యా! నీ విద్యాపాటవము నా మనస్సున కెంతో ఆనందము కలుగజేయుచున్నది.

అన్న : అమ్మా! నాకు నేటి తెల్లవారుజామున ఒకకల వచ్చినది.

లక్క : ఏమిటా కల నాయనా! చెప్పుము,

అన్న : ఆ కలలో శ్రీ వేంకటేశ్వరస్వామి కనిపించాడు. ఆహా! ఎంత మనో హరమైన రూపము! ఆ శ్రీనివాసుడు శంఖ చక్రాదులతో

కీర్తన : ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి ॥ఇప్పు॥
అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాస్యు బొడగంటి జయ్యన మేలుకొంటి
కనక రత్న కవాట కాంతు లిరుగడ గంటి
ఘనమైన దీప సంఘములు గంటి
అనుపమ మణిమయ మగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కున మేలుకొంటి ॥ఇప్పు॥
అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని అభయ హస్తము గంటి
తిరువేంకటా చలాధిపుని చూడగ గంటి
హరిగంటి గురుగంటి వెంటనె మేలుకొంటి ॥ఇప్పు॥

నారా : ధన్యుడవు నాయనా!

లక్క : (నారాయణసూరితో) స్వామీ మన అన్నమయ్య పిన్నవయసులోనే ఆంధ్ర, సంస్కృత భాషలందు అపారమైన జ్ఞానము గడించుటయేగాక, సాహిత్య సంగీతములందును ఆరితేరినవాడగుచున్నాడు. మీ తండ్రిగారికి చెన్నకేశవుని దయవల్ల విద్యలబ్బినట్లే మన కుమారునకు కూడా శ్రీ వేంకటేశ్వర స్వామి దయవలన సర్వవిద్యలు వచ్చుచున్నవి.

అన్న : అమ్మా! నేడు మన ఊరవెలసిన చెన్నకేశవస్వామి తిరునాల కదా! నేను దేవాలయమునకు వెళ్లి పూజచేసి వచ్చెద.

లక్క : అలాగే బాబూ, పూజాద్రవ్యములు సిద్ధముగా యున్నవి. మన రామశర్మ కూడా పూలు, పండ్లు, తెచ్చియున్నాడు.

నారా : అన్నమా! స్వామిని పూజించు విధానము నీకు తెలుసా, ఏవిధంగా పూజింతువో చెప్పగలవా?

అన్న : తండ్రీ! నేను స్వామికి నమస్కరిస్తూ

సీ॥ చిన్ని చెంబుతొ నీళ్లు శీకాయ ఉదకంబు
అల్లంబు బెల్లంబు అరటిపండు
తేనెతో మాగిన తియ్యమామిడిపండు
బంగారు పిడికెళ్లు పనస తొనలు
సొగసిన ఔగులు సొజ్జలు కజ్జలు
చక్కెర మండెగ లుక్కెరాళ్లు
అర్సెలు సిమ్మిలు దొసెలు కల్గొసల్
పానక లేలకుల్ పాలపొంగు
హోళి బొరడాలు గారెలు బూరెచుట్లు
అప్పదప్పలున్ పప్పు పాయసములున్న
అమ్మబంపెను ఆరగింపన్న బుజ్జి
అన్నయ వరదాళ్ళుండు బుచ్చెన్న కేశ!

అని అమ్మ ఇచ్చిన అన్నింటిని స్వామికి అర్పించెదన
శ్రీ చెన్నకేశవుడు నా మనమున వెలసిన వేలుపు.
కేశవుడు, ఆ వేంకటేశ్వరుడును ఒకే దైవమని మాఅవ
అందువలననే బాల్యము నుండియు నేను స్వామిని ఆ

సీ॥ ఊటుకూరున తాత ఓనమాల్ సెప్పంగ
ఓ అని పల్కిన ఒడుపు లేదు
చింతచెట్టు క్రింద చెలికాండ్రతో చేరి
చెలగి చెర్లాటముల్ సలిపినాడ
తాళ్ళతాకను తండ్రి తన్ని దండించిన
తప్పించి నీ గుడి దాగినాను
తిరునాళ్ళకని టంగుటూరకు పోయినే
త్రోవ తప్పిన నన్ను బ్రోవలేద

గీ॥ జ్ఞాతు లందరు బాధించి సేతు జేయ
తల్లి గారాబమున నీదు దరిశనంబు
అమ్మజూపెను తాళ్ళపాకన్న తలప
నన్నన వరదాళ్ళుండు బుచ్చెన్న కేశ!

(తెరవ్రాలును)

## తృతీయాంకము ప్రథమ రంగము

(కొండల్లో కోనల్లో కొడవళ్ళతో గడ్డికోయుట. అన్నమయ్య, రామశర్మ, బ్రహ్మశాస్త్రి)

అన్న : సోదరా! రామశర్మ! నాకైతే ఇంటిదగ్గరనే యెంతెంతో చదవాలని శ్రీ వేంకటేశ్వరుని లీలలను ఆలపిస్తూ గడపాలని అనిపిస్తూ ఉంటుంది. ఐనను యేమిచేయవలె. ఇంటిలో ఒకటేపోరు. ''వట్టి పాటలు పాడితే పొట్టనిండుతుందా! ఇంటిపనులు చేయకపోతే తిండి వంటపడ్తుందా?'' అని ఒకటేగోల. అవుకు గడ్డైయినా కోసుక రాకపోతే యెట్లా? అని.

రామం : అన్నమా! మీ వదినె ఉన్నదే మీ పెద్దతండ్రి కోడలు మహాగడుసుది. మీ అమ్మ, నాన్నలేమో మంచివారే, మరి మీది ఉమ్మడి కుటుంబం కదా! ఎప్పుడూ ఏదో ఒకపని చేయకపోతే మీ వదిన చిర్రు బుర్రులు. ఏం చేద్దాం. గడ్డికోసికొని వస్తాం పద. మేము వస్తాం.

బ్రహ్మ : ఒరేయ్ రామం మనం పచ్చిగడ్డి కోసుకరాకపోతే ఆవులు,గెదెలు, మస్తుగపాలు ఇవ్వవు కదా?

రామం : ఔను.

బ్రహ్మ : పాలులేకపోతే పెరుగు....మజ్జిగ....నెయ్యి!

రామం : ఉండవు.

బ్రహ్మ : నెయ్యిలేకపోతే నేతి అత్తిరాసాలు నేతి లడ్డూలు ఉండవుకదా!

రామం : అయ్యోరామ! నీతిండి రామాయణము మొదలుపెట్టావా! వెధవా! తిండికితిమ్మన్నా పనికి పందన్నా నీపొట్ట పగులా! కుంకా! యెప్పరూతిండి ఆలోచనేనా!

బ్రహ్మ : (కడుపు పట్టుకుంటూ) ఆపరా ఆపు నువ్వుతిత్తు ఉంతే నాకు కడుపులోమంత వస్తుంది. మళ్లీ ఆకలౌతుంది. ప్రొద్దున్నే ఏదో కొద్దిగా ఫలహారముతిన్నాను నీఅరుపులకు తిన్నదిఅరిగిపోతుంది.

అన్న : మిత్రులారా! మీరు, అదిగో కన్పిస్తున్నదే, అటువైపు వెళ్ళండి అక్కడ గడ్డి బాగా ఉన్నట్లుంది. నేనిక్కడనే గడ్డికోసెదను.

రా. బ్ర : అలాగే మిత్రమా! (కొడవళ్ళు గంపలు తీసికొనివెళ్తారు) (అన్నమయ్య గడ్డినికోస్తాడు కొంచెము కోసినతర్వాత వ్రేలుపట్టుకొని)

అన్న : అబ్బా! వ్రేలు తెగినది రక్తము కారుచున్నది. ఇక గడ్డిని కోయ లేను. ఇంటికెళ్లిన వదినగారి తిట్లు భరించసాధ్యంకాదు. ఏమి చేయవలయును........

ఈ చరాచర జగత్తులో ప్రతి ప్రాణియందును భగవంతు డుండునని పెద్దలందురు కదా! ఈ గడ్డిపరకలోను జీవమున్నది. మనవలెనే దీనికి బాధలున్నవి కదా! కాన దీనిని హింసించుట చేతనే నాకీశిక్షపడినదా! మరి అటులైన ఇతర ప్రాణులను బాధ పెట్టనిదే ఈ మానవకోటి జీవించగలదా! దూడను ప్రక్కకులాగి ఆవుకున్న పాలన్నియు అన్నీ తెలిసిన అమ్మ పితుకుతున్నది కదా! ఏమిటో యీమానుష జన్మ! అంతయు కడువింత, అంతయూ దైవ మాయ, అందుకే వేదజ్ఞానము తెలిసిన వారలైననూ ఆహార, సంసార, ఇంద్రియ సుఖాలను మరచుటలేదు. స్వామీ శ్రీనివాసా

కీర్తన : ఎక్కడి మానుష జన్మంబెత్తిన ఫలమేమునదన్న
నిక్కము నిన్నేనమ్మితి, నీ చిత్తంబికను ॥ఎక్కడి॥

మరువను అహారంబును, మరువను సంసారంబును
మరువను యింద్రియ భోగము, మాధవ! నీ మాయ!
మరచెద సుజ్ఞానంబును, మరచెద తత్వరహస్యము,
మరచెద గురువును, దైవము, మాధవ! నీమాయ! ॥ఎక్కడి॥

విడువను బాపము పుణ్యము, విడువను నాదుర్గుణముల
విడువను మిక్కిలి యాశలు, విష్ణుడ! నీమాయ!
విడిచెద షట్కర్మంబులు, విడెచెద వైరాగ్యంబును
విడిచెద నాచారంబును, విష్ణుడ! నీమాయ! ॥ఎక్కడి॥

తగిలెద బహులంపటముల, తగిలెద బహుబంధంబుల
తగులను మోక్షపు మార్గము, తలపున ఎంతైనా
అగపడి! శ్రీ వేంకటేశ్వర! అంతర్యామివై
నగినగి నను నీ వేలితి నాకా! యీ మాయ! ॥ఎక్కడి॥

స్వామీ! నీ మాయకు లోనుగాని వారెవరు? అబ్బ వ్రేలు బాధగాయున్నది,

పద్యము : చ అరయగ పంచభూతముల కొద్యుని, సృష్టి చరాచరమ్ములం
దిరముగ నిండియుండు ఘను, దెల్యక గోసితి గడ్డినక్కటా!
త్వరపడి వ్రేలుకోయబడె, వచ్చెను రక్తము బాధకల్గెడిన్
యెరుగక తప్పుజేసితిని, యేలుము,గావుము వేంకటేశ్వరా!

(దూరంగా గోవిందనామ స్మరణం వినిపిస్తుంది)
ఎవరో భక్తులు ఇటే వస్తున్నారు.
(తిరుపతి ప్రయాణీకులు 1. తిరుపతిస్వామి 2. మాధవయ్య మరియు కొందరు ప్రవేశింతురు)

...లు : గోవిందా! గోవిందా! యేడుకొండలవాడా వేంకటేశా!

...ఎ : అయ్యలారా! ఎవరు మీరు? గోవిందనామ స్మరణచేయుచు ఎచ్చటికి పోవుచున్నారు?

...పతి స్వామి : నాయన పరుస గుంపులవారము. శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకై తిరుపతికి పోవుచున్నాము.

...ఎ : అయ్యా! నేనుకూడ మీవెంట వచ్చెదను, ఇంతవరకు నేను తిరుపతి చూడలేదు, ఆ స్వామినీ చూడలేదు.

...॥ : స్వప్న మందున వేంకటేశ్వరుని గంటి
కాని కనసైతి. నిందాక కన్నులార
మీదువెంటను నన్గాని పోదురేని
కనుల దర్శింతు స్వామిని కాంక్షదీర

...ధవయ్య : ఈ పిన్నవయసున కష్టతరమైన కొండమార్గమున కాలి నడకన యాత్రసాగించుట కడు కష్టము బాబూ.

: నీవును జూడబాలుడవు నింగిని దాకెడి శేషశైలపున్
త్రోవలు కర్కశమ్ములగు దూరగజాలని కంపచెట్టులున్
తీవెలు రాళ్ళపేటులును తీర్థపుకోనలు గల్గియుండు నీ
వేవిధి వత్తువయ్య? మరియింట నుబెద్దల యాజ్ఞగొంటివే!

...ఎ : అయ్యా! దైవ దర్శనానికి వెళ్ళటానికి కూడా పెద్దల అజ్ఞలు, అనుమతులు కావలయునా!

...పతి : బాబూ! తల్లిదండ్రులు, గురువులు, మిత్రులు, బంధువులు, ఏల్లప్పుడు మన మేలుకోరేవారు కదా! మరియు మనమంచి చెడ్డలను గమనించే వారు కూడా,

...వ్యము : గీ॥ జన్మ నిచ్చెదరు జననీ జనది లవల
విద్య గఱపింతు, గురువులు వేడ్కమీర
స్నేహితుల వల్ల గుణములు జేరివెలయు
చుట్టు పక్కాలు ప్రేమతో జూతురవని.

ఇంతకూ బాలకా, నీ ఊరేది? నీపేరేమిటి?

అన్న : అయ్యా! అదిగో దూరంగా కనిపిస్తున్నదే అదే మా గ్రామం పేరు తాళ్లపాక, ఇక నాపేరు అన్నమయ్యస్వామి. నేను మీవెంటనే వచ్చెదను. ఇంటికి పోవుటకు మనస్సు అంగీకరించుటలేదు నాఆత్మ ఆపరమాత్మ రూపాన్ని చూడాలని తహతహలాడుచున్నది.

మాధవయ్య : (తిరుపతి స్వామితో) చూడు తిరుపతిస్వామీ! మనమీ బాలుని యాత్రకు తీసుకెళ్లినచో తప్పేమున్నది.

తిరుస్వా : మాధవయ్యా! ఈ అన్నమయ్య గొప్ప భక్తుడుగా నున్నట్లున్నాడు. తొడుకొనిపోయిన తప్పేమియగును.
(అన్నమయ్యతో) సరియే, బాలకా నీవుకూడా మాతోడరమ్ము ఇక యాత్రను సాగింతము. గోవిందా! గోవిందా!

మాధవ : అన్నమయ్యా! నీకేమైనా దేవునిపాటలు వస్తాయా! వస్తే పాడు బాబూ, హాయిగ ఆడుతూ పాడుతూ నడక సాగిద్దాము.

అన్న : అలాగేనండి (అన్నమయ్య పాటపాడడం. తిరుపతిస్వామి మాధవయ్య తదితరులు పాటను పలకడం.)

కీర్తన : వేడుకొందాము వేంకటగిరి వేంకటేశ్వరుని ॥పల్లవి॥
ఆమటి మ్రొక్కులవాడె ఆదిదేవుడే వాడు
తోమని పళ్యాలవాడె దురిత దూరుడే ॥వేడు॥
వడ్డికాసుల వాడే వనజ నాభుడే పుట్టు
గొడ్డురాండ్రకు బిడ్డలిచ్చె గోవిందుడే ॥వేడు॥
ఎలిమి కోరినవరాలిచ్చె దేవుడేవాడు
అలిమేల్మంగా శ్రీ వేంకటాద్రినాథుడే. ॥వేడు॥

ఇప్పటికి చాలాదినములు చాలా దూరము నడచితిమి కదా! ఇంకను తిరుపతి ఎంతదూరమున నున్నది స్వామీ!

మాధ : తిరుపట్టణము దగ్గరకు వచ్చేశాము, బాలకా అదిగోచూడు

సీ॥ ! బాలకా! తిరుపతి పట్టణంబదె చూడు
సౌందర్యమొప్పార జగతి వెలయు
ఎత్తైన మేడల నింపార నెగురుచు
పర్వెత్తు నయ్యవే పావురములు
పొడవు వెడల్పులు పొలుపొంద నెక్కువౌ

వీధుల దిరుగాడు పెక్కు ప్రజలు
గోవింద రాజుల గుడిగోపురముజూడు
గంగమ్మ గుడియిదే కనుము మున్ను
గీ॥ రాము దేవాలయమ్మదె రంజిలంగ
యాత్రికుల గుంపులయ్యవే యధికముగను
వేంకటేశ! గోవింద! గోవింద యనుచు
వెడలుచున్నవి వీధుల వేడ్కమీర

తిస్వా : అన్నమయ్యా! ఇదేతిరుపతిలో వెలసిన గంగమ్మగుడి. గంగమ్మకు నమస్కరించి ఆకనిపించే పర్వతముల నెక్కవలయును. (అందరు నమస్కరించి పయనింతురు)

మాధ : అవిగో శేషాచల పర్వతములు! ఆయేడు కొండలపైన తిరుమలలో. శ్రీనివాసుని సన్నిధి.

అన్న : ఆహా! హరివాసమైన పర్వతాలు, శేషాచల పర్వతాలు, నిజముగనే పదివేల శేషులు పడగలెత్తినట్లున్నవి.

కీర్తన : అదివో అల్లదివో శ్రీహరివాసము
పదివేల శేషుల పడగలమయము ॥పల్లవి॥
అదెవేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల మునులకు
అదెచూడు డదెమ్రొక్కు డానందమయము ॥అదివో॥
చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము ॥అదివో॥
కైవల్య పదము వేంకట నగమదివో
శ్రీ వేంకటపతికి సిరులయినది
భావింప సకల సంపద రూపమదివో
పావనములకెల్ల పావన మయము ॥అదివో॥

తిరు : ఆ ఆడిపడి నరసింహస్వామిని దర్శించి తలయేరుగుండుకు తలను తాకించి నడకసాగింతము.

కం॥ అడిపడి నరసింహుడుగల
గుడియిది మ్రొక్కి తలయేరు గుండును గనుమా!
కడుప్రీతి నీదు తలనటు
నెడయక తాకించు మయ్య యెడమగు నఘముల్

మాధ : అన్నమయ్యా! ఇచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామి పాదములున్నవి. చూడుము.

అన్న : మాధవయ్యగారూ! స్వామివారి పాదములా! ఇచ్చట యేల యున్నవి? ఎలావచ్చినవి?

మాధ : అదిగో అచ్చట శిలాఫలకము మీద వ్రాయబడినది. నేను చెప్పెదను. వినుము.

పద్యము : కురువనంబి యనెడు నొక కుమ్మరీడు
వేంకటేశుని భక్తుండు వెలసియిచట
ప్రతిదినమ్ము స్వామికి మట్టి పాత్రలెన్నొ
చేసి యర్పించి గుడికేగి శ్రీనివాసు
పూజగావించి వచ్చుచు ప్రొద్దు బుచ్చు

అటుల ఒకనాడు అతడు పూజకు వెళ్లలేక ఆ రాత్రి చాలా చింతింపసాగెను. తెల్లవారి నిద్రలేచి చూడగనే స్వామిపాదములు రెండు ఇచ్చటనే వ్రాలియుండెను.

తిరు : అప్పుడా కురువనంబి చాలా సంతోషపడి ప్రతిదినము సకాలములో స్వామిని మట్టిపూలతో భక్తిగ పూజచేయుచుండెను. అప్పటిలో తొండమానుడ నెడిరాజుస్వామి గుడికెళ్ళి ప్రతిరోజు స్వర్ణపుష్పాలతో పూజిస్తూ గర్వపడుతూ ఉండెను. ఒకనాడు స్వామి

పద్యము : పూజ కొసగిన బంగారు పూలద్రోసి
బంకమట్టి పూవుల తన పాదములను
నిలిపియుండంగా గనితేడు కలగిమదిని
విషయమెరిగియు నహమును విడిచివేగ
కురువ నంబినిసేవించి గొనియెముక్తి

అన్న : ఆహా! స్వామి ఎంతటి భక్తవత్సలుడు! నేడుకదా! నాజన్మ పావనమైనది. విరించి మొదలుగా గల దేవతలు సేవించిన శ్రీనివాసుల చరణముల సేవించు భాగ్యము కల్గినది.

కీర్తన : బ్రహ్మకడిగిన పాదము
బ్రహ్మము తానె నీపాదము ॥పల్లవి॥
చరణములు
చెలగి వసుధ గొలిచిన దీపాదము
బలితల మోపిన పాదము
తలకక గగనము తన్నిన పాదము
బలిరిపు గాచిన పాదము ॥బ్రహ్మ॥
కామిని పాపము కడిగిన పాదము
పాము తలనిడిన పాదము
ప్రేమతో శ్రీసతి పిసికెడి పాదము
పామిడి తురగపు పాదము ॥బ్రహ్మ॥
పరమ యోగులకు పరిపరి విధముల
వరమొసగెడి నీ పాదము
తిరువేంకటగిరి తిరమని చూపిన
పరమ పదము నీ పాదము ॥బ్రహ్మ॥

మాధ : బాలకా! ఇక నడక కొంచెం కష్టతరమే.

అన్న : ఔనుస్వామీ! మోకాళ్ళు పట్టుకొని నడువవలసి వస్తున్నది. శరీర మంతయు అలసిపోవుచున్నది. ఈ పర్వతాలను ఎక్కి స్వామి సన్నిధికి చేరగలనా! అన్న అనుమానము కలుగుచున్నది

తిరు : ఇదియే మోకాళ్ళ పర్వతము మెల్లగా నడచు బాబు.

అన్న : ఊహూ! నాకు సాధ్యమగునట్లు లేదు. నేను మీ వెంటవచ్చిన మీ యాత్రకు ఆటంకముకలుగును. తాళ్లపాక నుండి ఇంతవరకు మీరు నాకు సహాయముగా ఉన్నారు. ఇంకనూ మిమ్ము కష్టపెట్ట నామనసు అంగీకరించుటలేదు. మీరువెళ్ళండి, నేనునిదానముగా వచ్చెదను.

మాధ : అన్నమయ్యా! నీవు ఒంటరిగా ఉండగలవా? మరియు ఒంటరిగా రాగలవా?

అన్న : అయ్యా! ఆ దేవుని స్మరిస్తూఉంటె ఏ భయమూ ఉండదు. ఏ బాధయుండదు కదా! మీరు పదండి.

తిరు : సరే, మెల్లగా రమ్ము. తిరుమలలో స్వామి మందిరమున కలిసి కొందము.

అన్న : (కొంచెము దూరము నడచి) అయ్యో కాళ్ళులాగుచున్నవి. అబ్బ వళ్ళంతయు బాధగాయున్నది. నాలుక తడియారిపోవుచున్నది. ఈ పర్వతాల నెక్కగల నన్నుధైర్యము సన్నగిల్లుచున్నది. వచ్చునప్పుడు తల్లి దండ్రుల దీవెనలు గైకొనక వచ్చినందుకు దేవుడు నన్ను బాధపెడ్తున్నాడా? స్వామి వేంకటనాధా!

శ్లోకం : త్వమేవ మాతాచ పితాత్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవ దేవ

అబ్బా. ఆకలి విపరీతముగా నున్నది. కండ్లు తిరుగుచున్నవి. తోడు వచ్చుచుండిన స్వాములను నేనే సాగనంపితిని కదా! ఇప్పాట నన్నాదరించు వారెవరున్నారు?

సీ॥ : గ్రామ దేవతనైన గంగకు మ్రొక్కితి
అడిపడి నరసింహు నరయ గంటి
తలయేరు గుండును దవిలితి నాపైన
పెద్దయెక్కుడు నట్టె పేర్మినెక్కి
కపురంపు కాలువ గడచితి నవ్వల
పుణ్యభూములు చెట్లు బోయెనెన్నొ
పావన నదులందు భక్తిగా మునిగితి
మోకాళ్ళ ముడుపును బూర్తి నడువ

గీ॥ : వచ్చినాడను నాకేదొ బడలి కయ్యె
ఆకలగుచుంట వలనేమొ అదిగొ అచట
వెదురు పొదక్రింద చల్లగా బొదలు నీడ
అందు విశ్రాంతి గైకొని అరుగుదేను.

అదిగొ ఆపొదక్రింద. ఆబండపైన పరుండెద. (అని ఆపొదక్రింద బండపై కూర్చొని)
అమ్మా! జగన్మాతా! అలిమేలు మంగా! సర్వ జగత్తుకు మాతవే! అకలైన దూడ "అంబా"యని యరచిన మాటలురాని మూగ ప్రాణి ఆవు సైతం పరుగులిడి దూడకు పాలిస్తుంది కదా! ఈఅడవిలో అలసి సొలసి యున్న నన్ను చూచిన జాలి కలుగుట లేదా? అమ్మా అయ్యను చూడాలని అంతదూరం నుండి ఆశతో

వచ్చితినే! నాయీశరీరానికేల? ఈ ఆకలి దప్పులు. ఈ శరీరానికేల అలుపు సొలుపులు అమ్మా! అలమేలు మంగా!

ఆ.వె॥ పాలకేడ్వ బిడ్డ పర్వెత్తి పాలిచ్చి
నిద్ర బుచ్చుతల్లి నెమ్మి నుర్వి,
జగతి కంత నీవు జననివే, మంగమ్మ
కావలేవె నన్ను కరుణ జూపి
(పద్యం చెప్పి పరుండి నిద్రబోవును.) (ఉరుములు మెరుపుల మధ్య స్త్రీమూర్తి ప్రవేశం నిదుర బోతున్న అన్నమయ్య)

అలిమేలు మంగ : (స్త్రీమూర్తి)

సీ॥ పసివాడ విచ్చోట పవ్వళించితివేర
ఆకలయ్యెనటర నీకు బిడ్డ
ఏ తల్లి గనియెనో యేరీతి బెంచెనో
ఒంటిగా నియ్యెడ నుంటి వౌర!
బాలకా! లెమ్మిక పంచభక్ష్యమ్ముల
తెచ్చితయ్య యివిగొ తినుము కొడుక
సాల గ్రామములున్న స్థలమైన యిచ్చట
పాదరక్షలిడిన పాపమన్న

గీ॥ లేచి భుజియించు నాయనా! లేర తండ్రి
ప్రీతి దినిపింతు రార, నా చేతి తిండి
తినిన నీ జన్మతరియించు, ఘనత బెంచు
రహిని రక్షించు వేంకట రమణుడెపుడు.

(అలిమేలుమంగ అంతర్ధానమగును. అన్నమయ్య నిద్రనుండి కండ్లు పులుముకొనుచు లేచును.)

అన్న : ఆహా! ఏమిటి? ఇది. కలయా? లేక నిజమా? ఎవరా స్త్రీమూర్తి! నాకు కనబడి తానే స్వయముగా నన్ను బుజ్జగించి పంచభక్ష్య పరమాన్నంబులు తినిపించినదే! అరె! కడువిచిత్రముగా యున్నది! (కడుపు తడుముకొనుచు) కడుపు నిండినట్లున్నది. ఆకలియుతీరినది. కలయే అనుకొన్న, ఇదెలా సాధ్యమగును. శరీరమునకు బడలికయు తీరినది. ఏమిటిది! ఇది అంతయు ఏదో మాయగతోచుచున్నది. నిజమనుకొందమా, ఏది! ఆమాతృమూర్తి! ఏది! అదృశ్యమైనదే. ఎవరా తల్లి? "ఈ పర్వతము సాల గ్రామముల మయము నాయనా! చెప్పులతో నడువరాదు"

అనినుడివినది నిజమే. నేను తప్పుచేసితిని. క్షమించు తల్లీ! (అని చెప్పులను తీసిపారవేయును) (ఆలోచించి) ఆ మహాతల్లి ఎవరై యుండును! ఎవరోకాదు, ఆమె శ్రీ వేంకటేశ్వర స్వాములవారి సతీ మణి అలమేలు మంగమ్మయే! నిజము ముమ్మాటికి నిజము! అడవిలో అలసిసొలసియున్న నన్ను కన్నతల్లివలె ఆదరించి కాపాడినది. ఆహా! ఆతల్లి ఎంతటి దివ్యమంగళ విగ్రహము.

ఉ : చొచ్చితి తల్లి నీ మఱుగు సొంపుగ నీ కరుణా కటాక్షమె
ట్లిచ్చెదొ నాకునేడు పరమేశ్వరి! యోయల మేలుమంగ! నీ
మచ్చిక నందు నీ తరుణి మన్ననచే నినుగంటి నీకు నా
బచ్చెన మాటలేమిటికి భ్రాతివి చూడగ వేంకటేశ్వరా!

అమ్మా! అలమేలు మంగా నీ యభినవ రూపము జలజాక్షు కన్నులకు చవులిచ్చెనమ్మా, గరుడాచలాధీశు ఘనవక్షమున నుండి పరమానంద సంభరితవై నిరంతరము నాథుని హరుషించగ జేసితివి గదమ్మా! స్వామీ! శ్రీనివాసా! శ్రీ దేవి లీలలతో నిరంతరము వర్ధిలుము తండ్రీ!

ఉ : అమ్మకు తాళ్ళపాక ఘనుడన్నడు పద్యశతమ్ము సెప్పె కో
కొమ్మని వాక్ప్రసూనముల గూరిమితో నలమేలుమంగ కున్
నెమ్మది నీవుచేకొని యనేక యుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మద మంది వర్ధిలుము జవ్వని లీలల వేంకటేశ్వరా!

ఇకనేను ఈ పర్వత శ్రేణువుల నవలీలగా నెక్కగలను. స్వామి పుష్కరిణి యందు స్నానమొనరించి దైవమందిరానికి వెళ్ళెదను.

## ద్వితీయ రంగము.

(తిరుమలలోని వేంకటేశ్వరస్వామి దేవాలయము. వైష్ణవ మహాచార్యులు ఘనవిష్ణువు మండపములో ఒకవైపు కూర్చొని యుండును. అర్చకుడు స్వామికి పూజచేసి హారతినిస్తూ)

శ్లో॥ శ్రీ యః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినాం॥
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం॥

(ఘనవిష్ణువు కూడా హారతి కళ్ళకు అద్దుకొని తిరిగి వెళ్ళి తన స్థలములో కూర్చొనును.)

అర్చ : (హారతి పళ్ళెం గర్భగుడిలోనుండి బయటకు తెచ్చి) (తనలో) నేటికి పూజా సమయము ముగిసినది. ఇక గుడితలుపులు మూసి ఇంటికెళ్ళవలెను. (తలుపులు మూసి తాళము వైచి ఘన విష్ణువు దగ్గరకు వెళ్ళి.) అయ్యా! ఘనవిష్ణువుగారు దేవుని దర్శించుటకు యేనాడు తమరు వచ్చినా కూడా దర్శనానంతరము వెళ్ళేవారు. ఈ రోజు ఎందుకో ఉదయం వచ్చినారు. ఈ దేవాలయ ఆవరణలో నే తిరుగుతూ ఈ మండపములోనే కూర్చొని ఈ వేళవరకు ఇచ్చటనే యున్నారు, పూజాసమయము దర్శన సమయము ముగిసినది. నేను కూడా గర్భగుడికి తాళమువేసికొని పోవుచున్నాను.

ఘనవిష్ణు : అర్చకా! వెళ్ళవలసిన నీవు వెళ్ళుము. ఈనాడు ఎంతో ముఖ్యమైన దైవకార్యము కాగలదని నా మనమున తోచుచున్నది.

అర్చ : దైవకార్యమా! స్వామీ!

ఘ-వి : ఔనయ్యా! శ్రీ రామానుజుల వారిచే వృద్ధినొందిన వైష్ణవమతము సరియైన ఆదరణ, ప్రచారము లేక నాటి నాటికి క్షీణించుచున్నది. నాకా వయస్సు ముగుస్తున్నది, అందునా నేను ఇక్కడ ఉన్న వైష్ణవ మత పీఠాధిపతినే కదా! వైష్ణవాన్ని వృద్ధిచెందించబోయే మహాభక్తుడు, మహానుభావుడు, ఏడుకొండల పైన చేరి తిరుగుచున్నాడు.

అర్చ : ఎవరు స్వామీ! ఆ మహానుభావుడు?

ఘ-వి : నాయనా! అర్చకా! రాత్రిస్వామి నాకలలో కనపడి........

కం॥ :

అన్నమయ నామధేయుడు
పిన్నడు, నాపైన భక్తి పెరిగియు నిచటన్
దిన్నగ బాడుచు దిరిగెడు
మన్నన, వైష్ణవము నిచ్చి మనుపుము వానిన్

అని చెప్పియున్నాడు. మరి ఆ బాలుడెవరో! ఎక్కడివాడో! ఎప్పుడు వచ్చునో కదా! యనినాకు ఆతురతగా యున్నది. నీ వింటికేగుము. నేనును కొంచెము సేపు ఎదురుచూచి మఠాని కేగెదను.

(అన్నమయ్య ప్రవేశము)

అన్న : (తనలో) అయ్యో! తలుపులు మూయబడినవే! పుష్కరిణిలో స్నానముచేసి వచ్చునంతలో ఆలస్యమైనది. అయ్యో! స్వామిని రేపటివరకు చూడలేనా? అదిగో అర్చకుడు యిప్పుడే పోబోవు చున్నాడు. (ప్రకాశముగ) అయ్యా! అర్చకస్వామీ! స్వామిని దర్శించు కొనవలెను. గర్భగుడి తలుపులు తీయండి స్వామీ!

అర్చ : దర్శనపువేళ మీరినది బాలకా! రేపురమ్ము (అని అర్చకుడు వెళ్ళ బోవును) అన్నమయ్య అడ్డువచ్చి.)

అన్న : అయ్యా! రేపటి వరకునా! అంతవరకు నేనాగలేను. ఇప్పుడే ఆ స్వామి దివ్యమంగళ రూపాన్ని నా కనుల పండువుగా చూడాలని ఉంది. అయ్యా! అయ్యా! మీకు వేయి ప్రణామములు, తలుపులు తెరవండి స్వామి.

(ఘనవిష్ణువు ఇందతా చూస్తూ కూర్చొని యుంటాడు.)

అర్చ : నాయనా! పూజా సమయవేళ ముగిసిన పిమ్మట ఒకసారి వేసిన తలుపులు మరల వెంటనే తీయరాదు. రేపుదర్శనము చేసికొందువు గాని, అంతవరకు అదిగో ఆ మండపము నందు యుండుము.

అన్న : (బాధగా) స్వామీ! స్వామీ! ఆ శ్రీనివాసుని దర్శనానికి సమయాన్ని నిర్ణయిస్తారా! దేవుడుభక్తులపాలిటి కల్పతరువు కదా! కోరిన కోర్కెలు దీర్చె దేవునకు మీరు అడ్డు పెట్టుట ఎందుకు? తలుపులు తీయండిస్వామీ! (ఘనవిష్ణువు లేచి ఆ బాలునిగమనిస్తూ)

ఘ-వి : (తనలో) ఈ బాలుడు చూడ గొప్ప భక్తుడుగా కనిపిస్తున్నాడు. స్వామి కలలో చెప్పిన బాలుడు ఇతడే కాబోలు నేమో! ఇంకనూ గమనించి పరీక్షించెదగాక. (ప్రకాశముగా అన్నమయ్య దగ్గరకు వచ్చి)

ఘ-వి : కుమారా! ఈ అర్చకుడు నీ కోరికపై తలుపులు తెరచుటయన్నది గుడియొక్క పై అధికారుల ఆజ్ఞనుల్లంఘించుట అవుతుంది కదా!

అన్న : (ఘనవిష్ణువుతో) స్వామీ! మీరు పెద్దలు, అన్నీ తెలిసినవారు ఈ చరాచర సృష్టికంతటికి అధిపతి, ఆ భగవంతుడే కదా! అటు వంటి ఆ స్వామిని దర్శించుట యన్నది. అధికారుల ఆజ్ఞల నుల్లంఘించుట అవుతుందా? స్వామీ!

ఘ-వి : (తనలో) ఈ బాలుని పట్టుదల తెలివితేటలను చూడగా ఇతని ఒప్పించడము కష్టమే. సరే నేను వారించడము ఎందుకు, తర్వాత ఏమి జరుగుతుందో చూస్తాము. (అని వెనుకటి తన స్థలంలో కూర్చుండును)

అన్న : (అర్చకుని చేతులుపట్టుకొని) స్వామీ! నేను చాలా దూరమునుండి ఎన్నెన్నో కష్టాలుపడి నడచుకొంటూ వచ్చాను. ఆ దేవుని చూడ వలయునని ఆశతో వచ్చాను. నా స్వామిని యిప్పుడే చూడవలయును

అర్చ : (ఆగ్రహముతో) ఏమిరా, బాలకా, నీ మొండి పట్టుదల! ఎంత జెప్పినను వినకున్నావు.

ఉ : ఎవ్వడ వోరిబాల! గుడినిప్పుడు దెర్యగ రాదటన్న, నీ
జెవ్వల బెట్టకన్ హఠము జేసెద వోర! అకాలదర్శనం
బెవ్వని కివ్వనోపు, గుడినేలెడి పెద్దల యాజ్ఞలేక, నీ
వివ్విధి బట్టినన్ బయలకేగగ ద్రోయుదు స్వామి బంట్లచేన్

అన్న : (దీనంగా) దేవా! వేంకటనాథా! బాల్యమునుండి నిన్నుకొలుస్తూ నిన్నుపూజిస్తూ వస్తున్నానే! నీ వరాన బుట్టినానని అమ్మచెప్పేది కదా! మరి యేమిటయ్యా, కదలక మెదలక గుడిలోన తలుపులు మూసికొని కూర్చున్నావు. నిన్ను చూడాలని తనివిదీర నీ సుందర రూపాన్ని నా మదిలో నిలుపుకోవాలని ఆశతో అమ్మనాన్నలకు కూడా చెప్పకుండా అత్యంతదూరం నుండి అతి ప్రయాసలతో, అమ్మ అలమేలు మంగమ్మ ఆశీస్సులతో, వడి వడి పరుగులిడి రాగా నిన్నుచూడవేళ ముగిసినదా! చిన్నప్పటినుండి నీ పాట విననిదే, నీ పాట పాడనిదే, పాలుకూడా త్రాగక మొండికేశేవాడిని కదా! తండ్రీ! మోకాళ్ళ పర్వతముపై ఆకలై పడిపోయిన నాకు అమ్మ నా కడుపునింపి నిన్ను చూడసాగ నంపినదే! మరి అయ్యవు నీవు ఈ కుమారుడిలా నిన్నుచూడ ఆశతో ఎదురు చూస్తూఉండ, గుడిలోన కునుకుతీస్తున్నావా!

సీ॥ : జాతి! నాతిగజేయ రాముండ వైతివి
కరినేల నొంటియై యురికి తీవు
ప్రహ్లాదు మాటను పనిబట్టి నిలబెట్ట
కంబాన బుట్టితే ఘనతీ వెలయ
పాంచాలి సభలోన ప్రార్థించగా నిన్ను
వలువ లొసంగితే వనజనాభ!
దూర్వాసు కోపాగ్ని! దూలగ నున్నట్టి
అంబరీషుని బ్రోచి నట్టి దేవ!

ఆ.వె॥ తాళ్ళపాక నుండి తమ దర్శనార్థంబు
వచ్చినట్టి నన్ను వలదటంచు
గుడికి తలుపుమూసి కుర్చుండగా లోన
న్యాయ మగునె! తలుపు దీయవయ్య
(ఉరుములు మెరుపులు తలుపులు తెరచుకొనును)

అర్చ : ఆహా! ఆశ్చర్యము తలుపులు వాటంతట అవియే తెరచుకొన్నవే!

కం॥ ఔరా! బాలక: యెంతటి
ధీరత్వపు భక్తి, నీది, తెరచితె తలుపుల్
ఈరీతి నిన్నెరుంగక
మారాములు జేసినాడ మన్నించు ననున్

ఘన-వి : (తనలో) నిశ్చయముగా యీ బాలుడే, స్వామి స్వప్నమందు చెప్పిన విషయము వాస్తవమే. ఈ బాలుని భక్తిని ఇంకనూ కొంత తడవు వీక్షించెదగాక!

(అన్నమయ్య లేచి స్వామికి నమస్కరిస్తూ)

అన్న : ఆహా! స్వామీ! నా జన్మ ధన్యమైనది. బాల్యమునందు నాకు స్వప్నమందు గోచరించినది, ఈ సుందరరూపమే! దేవా! శ్రీనివాసా! నా విన్నపము విని నాకన్నుల్లో నిలిచిపో! తండ్రీ! నా హృదయంలో ఉండిపో, ఎల్లప్పటికి నాలోనేఉండిపో తండ్రీ నిన్ను భావింపకై వసమైన పారిజాతమా! ఓ! నా ప్రాణబంధుడా! ఓ! మా కులదైవమా! బాలుడ, నేను నీకేమి అర్పింపగలను, నిన్నే మని అర్థించగలను! నిన్నేమని కీర్తించగలను! స్వామీ! వేంకటరమణా!

కీర్తన : పొడగంటి మయ్య మిమ్ము పురుషోత్తమా! మమ్ము
నెడయకు మయ్య కోనేటి రాయడా! ॥పల్లవి॥

కోరిమమ్ము నేలినట్టి కులదైవమా
నేరిచి పెద్దలిచ్చిన నిదానమా
గారవించి దప్పిదీర్చు కారుమేఘమా మాకు
చేరువ జిత్తములోని శ్రీనివాసుడా ॥పొడ॥

భావింప కైవసమైన పారిజాతమా, మమ్ము
చేవదేర గాచినట్టి చింతామణీ
కావించి కోరికలిచ్చె కామధేనువా, మమ్ము
తాపై రక్షించేటి ధరణీ ధరా, ॥పొడ॥

చెడనీక బ్రతికించే సిద్ధ మంత్రమా, రోగా,
లడచి రక్షించే దివ్యౌషధమా
బడిబాయక తిరిగే ప్రాణబంధుడా, మమ్ము
గడియించినట్టి శ్రీ వేంకటనాధుడా, ॥పొడ॥

అర్చ : (స్వామికి హారతినిచ్చి) బాలకా! నన్ను క్షమించుము, ఇదిగో హారతిగైకొనుము, తీర్థము దీసికొనుము. (తీర్థం వేస్తూ)

శ్లోకము : అకాల మృత్యు హరణం
సర్వరోగ నివారణం
సర్వపాపోపశమనం
శ్రీనివాస పాదోదకం
పావనం శుభం

బాలకా! నీ ఒక్కడవే వచ్చితివా! నీ వారెవ్వరు లేరా?

అన్న : అయ్యా! ఆ వేంకటేశ్వరుడే నాలోయుండగా నాకు తోడు యెందుకు? ఆ తల్లి అలమేలు మంగయే అండగా నుండగా నాకు వేరే తోడు యెందుకు? వేదములు వేదాంత రహస్యములు దెలిసిన మీకు నేనేమని వివరించగలను.

అర్చ : (తనలో) ఆహా! ఈ బాలుడు చూడ పదిహేనేండ్లవాడు, జ్ఞానము భక్తి చూడ ఆహా! ఎన్నో సంవత్సరాలనుండి దైవ మందిరమున అర్చకునిగా నున్ననూ, నాకు యిసుమంత కూడా వేదాంత రహస్యము తెలియకున్నది. వయసు ముదిరినంత మాత్రమున యేమి ఫలము.

ఉ : చూడగా బాలుడయ్యు కడు చోద్యమెలర్పగ పాటబాడగా
వీడె, కవాటముల్ గుడికి, వింతగనన్నది, బాలుడే కదా
నాడు, ధృవుండు కూడ తగనమ్మిక నెక్కడె దేవునూర్వులన్
కాడె, "సురారికూన" యటె, కంబమునందున జూపడేహరిన్

కాకము కలకాలమున్న యేమి ప్రయోజనము? విద్యాబుద్ధులుండ వలె గాని వయసు యెంత యెక్కువగా నున్న నేమి ఫలము? (ప్రకాశముగా) బాలకా! నీ పేరేమిటి? నీ ఊరెయ్యది? నిన్ను గన్న పుణ్యదంపతులెవ్వరు?

అన్న : నా పేరు అన్నమయ్య. (ఘనవిష్ణువు లేచి అన్నమయ్యను గమనిస్తూ అతనికి దగ్గరగా వస్తాడు) మా గ్రామము తాళ్లపాక. నారాయణసూరి, లక్కమాంబలు ననుగన్న తల్లిదండ్రులు.

అర్చ : (ఘనవిష్ణువుతో) స్వామీ! మీరు ఎదురుచూసే బాలుడితడే. స్వామి వారి వజ్రాలుపొదిగిన కంఠహారమువలె ధగధగ మెరిసే యీతని తేజస్సు చూడండి (అన్నమయ్యతో) బాబూ వీరు వైష్ణవ మతాధిపతులు. శ్రీ ఘనవిష్ణుస్వామివారు. నీ రాకకై ఎదురు చూస్తున్నారు.

అన్న : నేనువస్తానని యెదురు చూడడమా? కడువింతగనున్నది. స్వామీ!

ఘ-వి : ఔను కుమారా, రాత్రి స్వామి కలలో కనపడి నీరాక విషయమై తెల్పియున్నాడు. నీతో కాగల స్వామి కార్యములెన్నో కలవు. తప్పక నీవు వస్తావని ఎదురుచూస్తూ ఉన్నాను.

అర్చ : స్వామీ! ఘనవిష్ణుగారూ? బాలకా! అన్నమయ్యా! మీ అనుమతి యైన గర్భగుడికి తలుపులు వేసి ఇంటికేగెదను.

ఘ-వి : అలాగే వెళ్ళిరావయ్యా అర్చకా! మేమిదిగో ఈ మండపమువద్ద శ్రీనివాసుని విషయాలను చర్చించుకొంటాము. (అర్చకుడు నిష్క్రమించును)

కుమారా! అన్నమయ్యా! నీవు దైవ దర్శనానికి వచ్చినపుడే నీ ముఖతేజస్సును జూచి స్వామి స్వప్నమందున తెల్పిన అన్నమయ్యవు నీవేనని గ్రహించాను. అర్చకుని వాదన, దైవాన్ని సందర్శించాలనే నీ ఆరాటం గమనించాను. నీ భక్తి యెటువంటిదో చూద్దామని దూరంగా నిన్నే చూస్తూ ఉండిపోయాను

నిజముగా నీవు కారణజన్ముండవు. పిన్న వయసులోనే శ్రీనివాసుని మెప్పించిన కడు భక్తుడవు. జననమాదిగా నీలో స్వామి భక్తి నిండియున్నది. ఈ వేంకటేశ్వరస్వామి విషయం నీ వెరుగనిది. కాదు. ఐనను చెప్పుచున్నాను వినుము.

సీ॥ చెలగి వేదమ్ముల చేపయై గొనితెచ్చె
కూర్మమై వీపున కొండమోసె
నరసింహుడై బ్రోచె ధరణి ప్రహ్లాదుని
అరయ వరాహమై యసురుద్రుంచె
వామన రూపుడై బలిగర్వ మడగించె
పరశుడై రాజుల దరిమిచంపె
రాముడై గూలిచె రావణాసురు నట్టె
కృష్ణుడై దుష్టుల గీటడంచె

గీ॥ బుద్ధభగవానుడై పుట్టి పుడమిలోన
ధర, నహింసా వ్రతమ్మును వరలజేసె
కల్కియవతార మయ్యె వేంకటరమణుడు
అట్టి పరమాత్మ దశరూపుడనగ నితడె

మరి యీకలియుగంలో వైష్ణవ మత వ్యాప్తి చేయవలసి యున్నది. అది నీ వల్లనే కాగలదు. ఏ మంటావు?

న్న : చాలా సంతోషము స్వామీ! ఈ తనువు ఆ స్వామిదే, మీరు కోరినట్లు ఆ గోవిందుని ఖ్యాతి నలుదెసల వ్యాపింపజేయుదును. ఈ క్షణంనుండి మీరే నా గురువులు. (నమస్కరిస్తూ)

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః

చెప్పండి గురు దేవా?

ఁన : ఈ యుగంలో పరమతస్థులెందరో భారతావని ప్రవేశించి తమ మత వ్యాప్తికై ప్రాకులాడుచున్నారు. ఒకప్రక్క దేవుడేలేడనుచు నాస్తికవాదులు పల్కుచున్నారు మానవులతీరు ప్రస్తుతం ఎట్లన!

సీ॥ తనదేవుడే గొప్పయను చొక్కమూర్ఖుండు
పోట్లాడు నొరులతో బుద్ధిలేక
తన మతమేమిన్నయని బల్కుచొక్కండు

పరమతస్థులతోడ పంతమాడు
ప్రాంతీయ తత్వంబు పాటించి యొక్కండు
పరప్రాంతవాసుల బాధపెట్టు
దేవుండె లేడని భావించి యొక్కండు
నాస్తిక మతమును నడుపుచుండు

గీ॥ అవనినెందరో యిటువంటి వ్యసనములకు
దాసులైయుండి సంఘాన్ని తప్పుదారి
ద్రోయుచున్నారు అన్నమా! హేయమైన
యిట్టి కలుషాల దొలగంగ గొట్టవయ్య

మానవజాతి పశుజాతివలె మెలగుచున్నది. వారలందరిని నిజమైన మానవజాతిగా మేల్కొలిపి దైవభక్తిని వారిలో నింపి ఆ దేవుని మహిమలను వారికి తెలియజేయాలి. ఏడుకొండలవాని లీలలను తెలియజెప్పాలి. అందుకు నీవే సమర్థుడవు.

అన్న : అందుకు నన్నేమి చేయమంటారు చెప్పండి గురువుగారు! తప్పక మీ ఆదేశాన్ని పాటిస్తాను.

ఘ-వి : ముందు నీవు వైష్ణవాన్ని స్వీకరించాలి.

అన్న : మహాప్రసాదము స్వామీ!
(ఘనవిష్ణువు అన్నమయ్యకు ముద్రాధారణ చేయును.)

ఘ-వి : నాయనా అష్టాక్షరీ మంత్రోపదేశము చేసెదను. పలుకుము. ఓం నమో నారాయణాః ఓం నమోనారాయణాయ (గురువులు పలుమారు చెప్పడం అన్నమయ్య పలకడం)

ఘ-వి : కుమారా! నేటినుండి నీవు అన్నమయ్యవుకావు-అన్నమాచార్యుడను పేర పిలువబడెదవు.

అన్న : ధన్యుడను స్వామీ. ధన్యుడను.

ఘ-వి : కుమారా! పుట్టుటయు నిజము చనిపోవుటయు నిజము. నట్టనడుమ దంతా ఒట్టినాటకమే. కట్టకడపట కావలసినది కైవల్యము. తనువున పొడమిన యింద్రియాలన్నీ చిట్ట చివర యెచ్చటికి పోవును? మట్టిలో కలసిపోవును. వేంకటపతిని తనలో నింపిన ఆత్మ యెక్కడికి వెళ్ళదు. తోలు ఎముకలచే గాలితిత్తివలె నున్న దేహము పిన్ననాటినుండి మనము పెంచి పోషించిన

యీ దేహము. విధిచేత ఎప్పుడు ఏక్కడ బడిపోవునో కద! కానీ, శిష్యోత్తమా! వేంకటేశుని ఆత్మయందు నిలిపిన దేహము తిరిగి జన్మకురాలేదు. ఆ దేవుని యందే లయమగును.

అన్న : స్వామీ! మీ వల్ల వేదాంత సారమెంతయో గ్రహించితిని.

ఘ-వి : ఆ....మరచితిని, వైష్ణవ మతమందు శిష్యులకు అప్పగించవలసిన పనియున్నది. ఇదిగో ఇప్పుడేవెళ్ళి కొద్దిక్షణాల్లో తిరిగివచ్చెదను. అన్నమా! నీవు అంతవరకు అష్టాక్షరీ మంత్రాన్ని పారాయణం చేస్తూఉండు.

అన్న : ఆలాగే గురువుగారు వెళ్ళిరండి (ఘనవిష్ణువు వెళ్ళిపోవును) ఆహా నేనెంత ధన్యుడను. ఎంతటి ఉత్తముడైన గురువు నాకులభించెను సాక్షాత్తు రామానుజుల బోలు ఇహపరదైవము నా గురువు. మోక్ష మార్గాన్ని చూపే ఘన గురుదైవము నా గురువు.

కీర్తన : గతులన్ని ఖిలమైన కలియుగమందున
గతియీతడె చూపె ఘనగురు దైవము ॥ పల్లవి॥

ఈతని కరుణెకా యిల వైష్ణవుడనైతి
యీతని వల్లనే కంటిని తిరుమణి
యీతడెకా వుపదేశమిచ్చె నష్టాక్షరి మంత్ర
మీతడె రామానుజులు ఇహపరదైవము ॥గతు॥

వెలయించె నీతడెకా వేదరహస్యములు
చెలిమి నీతడెకా చూపె శరణాగతి
నిలిపినాడీతడెకా నిజ ముద్రధారణము
మలసి రామానుజులె మాటలాడే దైవము ॥గతు॥

నియమము నీతడెకా నిలిపె బ్రపన్నులకు
దయతో మోక్షముజూపె దగనీతడే
నయమై శ్రీ వేంకటేశు నగమెక్క వాకిటను
దయజూపి మమ్ము నిట్టె తల్లిదండ్రి దైవము. ॥గతు॥

(కూర్చొని పద్మాసనము వేసికొని)
"ఓం నమోనారాయనాయ" (పలుమార్లు పలుకుతూ ఉంటాడు)
(నారాయణసూరి, లక్కమాంబల ప్రవేశము.)

నారా : కుమారా! అన్నమయ్యా! ఏమిటినాయనా? ఇంటిని, మమ్ములను విడిచి కనీసం ఏ ఒక్కరికైనా తెలుపకుండా ఇచ్చటికి వచ్చియున్నావు.

అన్న : తల్లిదండ్రులకు వందనాలు.

లక్క : నాయనా! నీవు కనబడక ఎన్ని చోట్ల వెతికాము, వెతికించినాము. చివరకి తిరుపతిస్వామి, మాధవయ్య అను యాత్రికులవెంట నీవు యిచ్చోటికి వచ్చినట్లు తెలిసికొని వచ్చితిమి.

నారా : కుమారా! మేము నిన్నేమి బాధపెట్టితిమని యిలా ఎవరికి తెలియకుండా వచ్చితివి? గడ్డికని వెళ్ళినవాడివి అలాగే వచ్చేశావే! ఏమిటి బాబు,

అన్న : "ఓం నమో వేంకటేశాయ"

లక్క : నాయనా! అన్నమయ్యా ఏమిటిది? పలుకు తండ్రీ! లేకలేక కలిగిన కుమారుడవు. మా హృదయంలో బాధగా యున్నది కుమారా! ఇంటికి పోదాంపద నాయనా! ఇచ్చట నీకు నా అను వారు ఎవరు?

అన్న : అమ్మా!

లక్క : అయ్యో! వేంకటరమణా! ఏమిటిస్వామీ! సంతానము కలుగలేదని నీకు మ్రొక్కితిమే, నీ వరాన పుట్టిన వీడు ఈ వయసున మమ్మ వీడి నీచెంతనేయుండ సంకల్పిస్తున్నాడే ఏమి చేయుదుము స్వామీ!

లక్క : కుమారా!

సీ॥ బిడ్డలు లేనట్టి గొడ్డురాలని బిల్వ
ఓరిచి భరియించి తొక్కనాడు
ఎక్కన్న దరిజేర యేడుకొండల నెక్కి
సొక్కియు సోలితి నొక్కనాడు
కోనేటి చలినీళ్ల పూనికతో మున్గి
మిక్కిలి వణకితి నొక్కనాడు
గరుడ గంబము యొద్దవరపడి దీక్షతో
నుర్విపై బొర్లాడి తొక్కనాడు

ఆ.వె॥ కాంక్షదీర సుతుని గనితంచు మదిలోన
ఉబ్బిపోయితేను ఒక్కనాడు
అట్టి నన్ను వీడి అరుగుట న్యాయమే!

అన్న : అమ్మా! తల్లిదండ్రి యితడె దగజుట్టమీతడే
యెల్లగా బుట్టించే యేలికితడే కదా!
అటువంటిస్వామి చెంతనేనుండ గోరుచుండ మీరు నన్నీల సంసార సాగరంలో బడవేయ చూస్తున్నారు?

నారా : నాయనా! అన్నమయ్యా! ఆ దేవుడిచ్చోటనే యీ గుడిలోనే దాగి యున్నాడని తలంచుచున్నావా! అణువణువునా. అడుగడుగునా అందు యిందు అననేల? సర్వాంతర్యామియై అంతటా నిండి యున్నాడు. నీ స్వామిని కీర్తించవలెనన్న ఈ తిరుమల కొండలే అవసరమా! మనతాళ్ళపాకలోని ప్రశాంతవాతావరణం సరిపడదా? కుమారా! మన ఊరవెలసీయున్న చెన్నకేశవస్వామి, యీ వేంకటేశ్వరస్వామి ఒక్కరే అన్న విషయమెరుంగవా! రా తండ్రీ మన ఊరికి పోవుదుము.

అన్న : తండ్రీ! నన్ను బలవంతముచేయకండి, నేను యీ స్వామిని విడిచి రాలేను.

నారా : చూడుబాబూ, మాకు వయసు పైబడినది. ఈ వయసున మాకు తోడునీడగా నీవు ఉండకపోతే ఎలాకుమారా! తల్లిదండ్రికి మించిన దైవము వేరొండు కలదా! బ్రహ్మచారిగా నీ విచ్చోటనే ఉండిపోతే వృద్ధాప్యమున మాకు దిక్కెవ్వరు?

ఉ : దాయలు గేలిసేయుదురు తక్కిన వారలు నవ్వుచుండ, మా
ఛాయన నీవులేమి కడు స్వల్పులు సైతము లెక్కసేయకన్
హేయముగాగ జూచెదరు, యెట్టుల నోర్తుము. మమ్మువీడి నీ
వీ యడవిన్ బికారివయి యేటికి దిర్గుట రమ్ముపుత్రకా

(పద్యము చెప్పుచుండ మధ్యలో ఘనవిష్ణువు ప్రవేశము)

ఘ-వి : అన్నమాచార్యా! వీరు మీ తల్లిదండ్రులా?

అన్న : ఔను గురువుగారు.

నారా,లక్క : నమస్కారములు స్వామీ!

ఘ-వి : పౌత్రాభివృద్ధిరస్తు

నారా : ఆచార్యా! పుత్రుడే యింటిముఖం పట్టనని బ్రహ్మచారిగా, సన్యాసిగానే ఉంటానని పట్టుబట్టుచుండ, తమరు మమ్ము "పౌత్రాభివృద్ధిరస్తు" అని దీవిస్తున్నారు.

ఘ.వి : (నవ్వుతూ) ఆర్యా! నీ కుమారుడు అన్నమాచార్యుండు శ్రీ వేంకట రమణుని కొలుస్తూ మీ కుటుంబానికి మీ తాళ్ళపాక గ్రామానికి మరియు మనదేశానికి మంచిపేరు తీసుకరాగలడు. అంతియేగాక యితని సంతానముకూడ శ్రీవారిని కీర్తిస్తూ పూజిస్తూ మీ కుటుంబానికి మరియు మనదేశానికె కీర్తిప్రతిష్ఠలు తీసుక రాగలరు. ఇది ముమ్మాటికి సత్యము.

లక్క : స్వామీ! మీరైనా మాకుమారునికి నచ్చజెప్పండి. ఎంతగా ప్రాధేయపడినను, రానంటేరానని మొండికేస్తున్నాడు.

ఘ.వి : అన్నమాచార్యా! మీ తల్లిదండ్రుల వెంట వెళ్ళునాయనా!

అన్న : (ఆశ్చర్యంతో) గురువుగారూ ఇంతవరకు మీరు నాకు వేదాంత రహస్యాలెన్నో చెబుతూ "ఈ దేహము నిత్యముకాదు ఆత్మయే నిత్యము" "ఈ ఆత్మను పరమాత్మలో కలిపేవిధముచూడు" అని నాకు బోధించారు. మరియిప్పుడు నన్ను సంసారమనే మురికి కూపములో వెళ్ళమంటున్నారా! వద్దు ఆచార్యా వలదు.

ఘ.వి : చూడుకుమారా! మురికి కూపములో పడినచో దేహానికి మాత్రము మురికి అంటుతుంది కాని ఆత్మకు కాదుగద. అలాగే ఆత్మను శుభ్రపరచక దేహాన్ని శుభ్రపరచిన ఏమియు ఫలముండదు కద. తామరాకు నీటిలోనే ఉంటుంది, కాని దానికి నీరు అంటదు కద, అట్లే నీవుకూడ సాంసారిక జీవితంలో మునిగి తామరాకువలె సాంసారమనె నీటికి అంటక ప్రవర్తింతువులే. మీ తల్లిదండ్రుల వెంట యింటికివెళ్ళు. పెద్దవాడవుఐన పిమ్మట వివాహాది కార్యములు జరుపుకొని గృహస్త్రాశ్రమ ధర్మాన్ని స్వీకరించి వృద్ధులైన మీ తల్లిదండ్రులకు సేవచేయుము. "మాతృదేవో భవ, పితృదేవోభవ," తర్వాతివాడే గురువు దైవము. మాత పితరుల సేవసేయుచు వైష్ణవమత వ్యాప్తి, నారాయణమూర్తి నామజపము, తిరుమల వేంకటేశ్వరునిపై భక్తి, కలిగి నీ జీవితము పవిత్రమైనదిగా భాసించగలదు శిష్యోత్తమా!

ఆ.వె॥ : అన్నమయ్య నీవు అరుగుము యింటికి
తల్లిదండ్రులాజ్ఞతప్ప దగదు
నీదు వంశమందు మేధావులెందరో
పుట్టివెలయగలరు పుడమిలోన

అన్న : సరే గురుదేవా! మీ ఆనతి మేరకే నడచుకొనగలను.

కం॥ గురువర్యుడ! మీ యానతి
నరిగెద మా తల్లిదండ్రులలరగ పురికిన్
తిరుమలనాథుని మిమ్మును
మరువక నా జీవియాత్ర మనిపెదనెపుడున్

(ఘనవిష్ణువుగారి పాదాలకు నమస్కరించి) ఇక పోయివచ్చెదను స్వామీ!

నారా, లక్క : (నమస్కరిస్తూ) కృతజ్ఞతలు స్వామీ !వెళ్లివచ్చెదము

ఘ-వి : మంచిది వెళ్ళిరండి "ధనధాన్యాభివృద్ధిరస్తు" పౌత్రాభివృద్ధిరస్తు! (అన్నమాచార్యులు లక్కమాంబ నారాయణసూరి నిష్క్రమింతురు)

ఘ-వి : స్వామీ! వేంకటనాథా! స్వప్నమందు నీవు నుడివిన విధముననే అన్నమయ్యను అన్నమాచార్యునిగా చేసితిని. వైష్ణవమతమును అవలంబింపజేసితిని. ఇక అంతయూ నీ భారమే, తెలిసీతెలియక నేనేదైన తప్పుచేసియుండిన క్షమించుస్వామీ!

శ్లోకం : వినా వేంకటేశం ననాథో ననాథ
స్సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ

శ్లోకం : అజ్ఞాని నామయా దోషాన్ నశేషాన్విహితాన్ హరే
క్షమస్వత్వం క్షమాస్వత్వం శేషశైల శిఖామణే!

శ్లోకం : ఓం సర్వేషాం స్వస్తిర్భవతు ఓం సర్వేషాం శాన్తిర్భవతు
ఓం సర్వేషాం పూర్ణంభవతు ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

## చతుర్థాంకము. ప్రథమ రంగము

(తాళ్ళపాకగ్రామం: పాత్రలు: రామశర్మ, బ్రహ్మశాస్త్రి అన్నమాచార్యులు-వయస్సు 20-25 సం॥లు. భార్య తిమ్మక్క మీసాల రోశయ్య (దొంగ) 30 సం॥ములు వయస్సు

(రామశర్మ, బ్రహ్మశాస్త్రిల (విద్యార్థులు) ప్రవేశము)

రాశర్మ : ఒరేయ్ బ్రహ్మం! మనఅన్నమయ్య మనకంటె వయసులో చిన్నవాడు. ఎన్నోవిద్యలు నేర్చి తిరుపతికిపోయి అన్నమాచార్యుడై తిరిగి తల్లిదండ్రుల వెంట ఇంటికివచ్చినాడు, అంటె స్వగ్రామమైన మన తాళ్ళపాకకు వచ్చినాడు కదా!

బ్ర.శాస్త్రి : ఔనౌను తిమ్మక్క, అక్కలమ్మ అను కన్యలను ఇద్దరిని పెండ్లి చేసుకున్నాడు. ఒరేయ్ రామం, ఆ పెండ్లిలో ఆ పిండివంటలు ఆ పెండ్లిభోజనాలు ఆహ ! అబ్బ ! నాకు మళ్ళీ నోరూరు చున్నదిరా! ఇప్పుడే అల్పాహారం తినివస్తున్నాను.

రామం : బ్రహ్మం! నీ నాలుకమాత్రం బాగాఅరిగిందిరా. మాటలు ఇప్పుడు బాగానేవస్తున్నాయి. కాని కడుపుమాత్రం తరగలేదురా ఎప్పుడూ తిండీ, తిండీ, అందుకేరా నీ కెవ్వరు పిల్లనే ఇవ్వనంటున్నారు.

బ్రహ్మ : ఒరేయ్ నీకుమాత్రం నీ పొడుముఖం చూసి "రా నాయనా రా వచ్చి మా అమ్మాయిని పెండ్లిచేసికో" అని ప్రాధేయ పడుతున్నారు కదూ! వెదురుబొంగు వెధవా! నా గతిఎంతో, నీగతి అంతేరా!

రామం : (దిగులుగా) ఔనురా! అదేంఖర్మోగాని మనకు చదువూ పూర్తిగా అబ్బలేదు. మనకు పెండ్లియీడువచ్చినా పిల్లనిస్తామనేవాండ్లు లేరు అదిగోచూడు అన్నమయ్యకు, నాకు వివాహమే వద్దుబాబో అంటున్నా, మొదట అతడు లౌకికము లేనివాడు, అతనికి పిల్లనివ్వమ్మా, అని అనినవారే తర్వాత ప్రాధేయపడి ఇద్దరి పిల్లలను ఇచ్చి పెళ్ళిచేసినారు, అదిరా అదృష్టముఅంటే. ఇద్దరు భార్యలురా, ఒకరు తిమ్మక్క ఇంకొకరు అక్కలమ్మ. అబ్బ ఎంత అదృష్టవంతుడ్రా మన అన్నమయ్య, మనము ఉన్నాం ఎందుకు ఒకరుదొరకలే.

బ్రహ్మ : అన్నమయ్యకు శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహం ఉందిరా! మనకు చెన్నకేశవస్వామి దయకూడాలేదు. ఎంచేద్దాం! ఒరేయి రామం! మొన్న ఒకవిషయం జరిగిందిరా ఎవ్వరితోనూ చెప్ప కుసుమా! మానం, మర్యాద పోతాయి.

రామం : ఇంతకు ఏం జరిగిందిరా!

బ్రహ్మ : మొన్నసాయంకాలము నేను గడ్డికోసుకోవటానికి పొలంవెళ్ళానా! ఆ ప్రక్కపొలంలోనే ఒక అమ్మాయి గడ్డికోస్తున్నది. ప్రక్కఊరి పిల్ల. అబ్బ ఎంతసొగసుగా ఉందనుకొన్నావ్! అవికండ్లుకాదురా నేరేడుపండ్లు, ఆ పెదవులు చక్కెరకేళీఅరటిపండ్లే, ఆమెడ అచ్చం బొప్పాయిపండు చనులు మలుగూబ మామడికాయలేఅనుకొ. ఆపొట్టచూశావూ! అచ్చం చిల్లిపెట్టిన మినపవడ. పిఱుదులు బూడిదగుమ్మడికాయలు.

రామం : అబ్బ వర్ణన వద్దుకాని అసలు విషయానికి రారా తండ్రీ!

బ్రహ్మ : "బ్రహ్మకైన బుట్టు రిమ్మతెగులు" అంటారు విన్నావా! ఎప్పుడైనా! ఈ వీరవేంకటనృసింహ మాధవ సూర్య బ్రహ్మ శాస్త్రికి కూడా ఆ పిల్లను చూస్తూనే "తెగులు: గుబులు: పుట్టింది అంతే! ఆకొడవలి పారేసి ఆ పిల్లదగ్గరకుపోయి ఇలా పాడడం మొదలుపెట్టినాను.

పాట : రావే! రావే! ఒయ్యారి
సయ్యాటలాడేము ఈ పొలములోన ॥రావే॥
ఒంటిగానున్నవు నీ జంటకేనొస్తాను
పంటపొలములోన పండుగేచేద్దాము ॥రావే॥
మా యింటికొస్తేను వంటజేసి పెడతాను
నిన్నుపడుకోబెట్టి పనులన్ని జేస్తాను ॥రావే॥
నువు కొట్టినా తిట్టినా నిన్నేమి అనబోను
నీపాదాలకే సేవ నేజేస్తుఉంటాను ॥రావే॥

అని పాడేనో లేదో ఆపిల్ల గడ్డికోసే కొడవలితో వచ్చి నన్ను పట్టుకొని కొడవలి నా పొట్టమీద పెట్టి అయ్యో! (ఏడ్చుతూ) ఆ తిట్లు ఆ దెబ్బలు చెప్పలేనురా!

రామం : ఏడవకురా సోదరా! మనకు ఏలిననాటిశని పట్టియున్నాడు. ఒరేయ్ బ్రహ్మం మొన్ననాకు ఒక విషయం జరిగిందిరా! ఎవరితోను చెప్పకుసుమా! మర్యాదపోతుంది.

బ్రహ్మ : ఏం జరిగిందిరా?

రామం : మొన్న ఉదయాన అలా మడుగుదగ్గరకు పోయినానురా, స్నానం చేద్దామని నేను పోయేటప్పటికి ఆ ప్రక్క ఊరిపిల్ల ఆ మడగులో ఈతకొడుతూ కనిపించిందిరా అబ్బ! ఎంత అందంగా ఉందను కున్నావు. ఈ రెండుకండ్లు చాలవురా ఆ పిల్లనుగురించిచెప్పాలంటే ఈ నోరు చాలదురా! గండుచీమల బారులాంటి పొడపైన వెంట్రుకలు. ఆ కండ్లు చేపకండ్లు. ఆ నడక హంసదేసుమా! ఆ పిల్లది కోయిలగొంతు చిలుక ముక్కు నడుం సింహంది. తాబేలులాంటి పొట్ట

బ్రహ్మ : అబ్బా! వర్ణన వద్దుగాని అసలు విషయం చెప్పరా బాబూ!

రామం : స్వయంవరంలో సీతను చూడగానే శ్రీరాముడికి శరీరం ఝల్లు మనిందట, విన్నావా! ఎప్పుడైనా! ఈ రామశాస్త్రికి ఆ సరో వరంలో తామర పూవులమధ్య జలకాలాడే ఆ సుందరిని చూస్తానే ఒడలు జలధరించిందిరా! మన్మధుడు నా ఒక్కడిపై బాణాలు వేశాడు అంతే ఇలా పాటమొదలు పెట్టానురా

పాట : మత్యకన్యవా! నీవు మరుని వింటావా!
నాకౌగింట రాలేవా! నన్ను చేరగదరిరావా
నీ సుందర రూపం జూసి
నామది మందిరమున నిల్పెదను
నీటిలోని నీఈతను జూసి
చేపపిల్లలా నీలో దూరెదను ॥మత్య॥
మన్మధా కారుడనేను
మనువాడ మీ యింటికొచ్చేను
త్రేతాయుగ రాముడ నేను
రమ్యముగా నిను రమియించెదనూ ॥మత్య॥

అంతే పాట అయిపోయిందో లేదో! అంతే ఆ పిల్లపైకి వచ్చి ఈ చెంప ఆచెంప వాయించేసింది. ఒరే అలా కొట్టుతా ఉంటే

ఎంతహాయిగా ఉందిరా! తర్వాత చేత్తో కొట్టడం మానేసి కట్టె తీసికొనింది. అంతే మడుగుదగ్గరనుండి ఒకటే పరుగు
(మీసాలరోశయ్య (దొంగ( ప్రవేశము తాగ్రుడుబోతులాగనడకతో)

బ్రహ్మ : ఎవరో తూగూతూ తూగూతూ వస్తున్నాడు. త్రాగుడుబోతు లాగున్నాడు.

రోశయ్య : దండాలుస్వామీ దండాలు.

రామం : (ముక్కుమూసుకొని) అబ్బ! కల్లువాసన

రోశయ్య : అయ్యా! చమించండి. పెద్దగా తాగలేదు. ఒక్కముంతకల్లే ఇంకా తాగుదామంటె (తూగుతూ మైకంలో) దుడ్డులేదు "ఒరేయ్ యెంగిటిగా రెండు ముంతలన్నా పొయ్యిరా" అంటె నా కొడుకు "పాతబాకీ తీర్చకపోతే కల్లుపోసేది లేదుపోవోయ్ అని మెడబట్టి తోసినాడు సామి! ఆ నాకొడుక్కి ఈ మీసాలరోశయ్య "మీసం త్రిప్పుతూ నాకతే తెల్లా, నేను అనుకోవాలేగాని తెల్లారేసరికల్లా అప్పుతీర్చలేడా! యేడాసందు దొరక్క సేతికిదుడ్డు సిక్కలేదు కాని, లేకపోతే ఆ యెధవ నా కొడుకు (పెద్ద మీసంత్రిప్పుతూ) నన్ను, ఈ మీసాలరోశయ్యను, మెడబట్టి తోస్తాడా! వరేసోమి! (బ్రహ్మ శాస్త్రితో) ఓ కడుపుసోమి! మీకు పెండ్లి పెటాకులు కాలేదుకద సోమి!

బ్రహ్మ : ఇంకా కాలేదు రోశయ్యా! అదేనయ్య మా బాధ.

రోశ : ఒద్దయ్యా సోమీ (రామశాస్త్రితో) పెండ్లేసేసుకోకండి నేను పెండ్లాంతో "ఒసే లచ్చిమే కోడికూర వండిపెట్టవే" అంటె, అది దానెమ్మ యేమందోతెలుసా సోమీ! నీ మొకానికి కోడికూర కావాల్నా తాగటానికి గంజికిగతిలేదు, తాగితాగి ఎప్పుడూదొల్తా ఉంటావు, ఒక్కపనీపాట లేదు, నేను కూలినాలి సేసుకొస్తే ఆ లెక్కంతా నీ మొకానపెట్టుకొంటావు అని నన్ను (మీసాలు త్రిప్పుతూ) ఈ మీసాలరోశయ్యను మొగుణ్ణని కూడఅనుకోకుండా తిడతాదా, దానెమ్మ! దుడ్డులేక దానికికూడా అలుసైపోయ్యాను.

రామం : ఔనయ్యా రోశయ్యా! ఈలోకంలో అంత, డబ్బుఉంటె ఆస్తి పాస్తులు మిద్దెలు మేడలు ఉంటె పెండ్లికొడుకు కుంటివాడైనా గ్రుడ్డివాడైనా, మూగవాడైనా, చెవిటివాడైనా, మరి పిల్లనిచ్చి పెండ్లిచేస్తారు. ఆ డబ్బులేకనేకదా మాకు ఇంతవరకుపెండ్లి కాలేదు.

రోశ : ఔనయ్యా సోమి! "దుడ్డులేనివాడు గొడ్డుక్కూడా కొరగాడంట" పరేసోమీ! మీ దగ్గర దుడ్డు సంపాదించే దోవయేదైనా ఉంటె సెప్పండి సోములూ, యేదైన మంతరమో తంతరమో సెప్పండి మీరు బాగా సదువుకున్నోళ్ళు కదా!

బ్రహ్మ : ధనము సంపాదించే మార్గముంటె, అయ్యో! మేమిట్లా ఉంటామా? బాగాలడ్డూలు అత్తిరాసాలు వడలు పప్పుపాయసాలు, చిత్రాన్నాలు నేతితోనే చేసే పిండివంటలు అన్ని బాగ చేసికొని తినేవారము కదా! ఒరేయ్ రామం నాకు ఆకలౌతున్నది రా!

రామం : ఒరేయ్ బ్రహ్మం మాటిమాటికి నీకు తిండిధ్యాసే తప్ప వేరేధ్యాస లేదురా! చెన్నకేశవ స్వామి కల్యాణమునకు పోవాలనుకున్న వాళ్ళం ఇంకాఇక్కడే ఈ పురాణాలతోనే సరిపోయె. అన్నమయ్య తిమ్మక్కగార్లు పెళ్ళి యీపాటికి ఉత్సవాన్ని చూస్తూ ఉంటారు.

రోశ : అయ్యా సోములూ ఒకముంతే కల్లుతాగినా. నాకు మత్తు తగ్గి పోయినది. మీ దగ్గర దుడ్డు ఏదైనా ఉంటె రొండువరాలు అయినా యియ్యండి సోములు, మీకు పుణ్యం ఉంటుంది.

రామం : రోశయ్యా నా దగ్గర ఒక్కదమ్మిడీ కూడాలేదు. నిజంగారోశయ్యా! ఆ చెన్నకేశవస్వామి మీద ఆన, నమ్మరా! నాయనా!

రోశ : (బ్రహ్మంతో) ఓ పొట్టసోమీ నీ బొడ్లో యేదైనా ఉంటె పంచ ముడి యిప్పి దానం చెయిసోామి, చచ్చి నీ కడుపున పుడతాను.

బ్రహ్మ : అయ్యో ఖర్మా! నీవుచచ్చి నా కడుపులోకి రావద్దు నాయనా! నింజగా నా దగ్గర కూడా ఒక్కరాగి దమ్మిడీ లేదు. అదిగో అన్నమయ్యయింట్లో ఉందే ఆ బంగారు విగ్రహం దానిమీద ఆన.

రోశ : సోమీ! యేంది అన్నమయ్యగారింట్లో బంగారు యిగ్రం ఉందా! అమ్మో అమ్మో అమ్మి తేశానాదుడ్డు శేస్తదే సోమీ మీరుతిరునాలకు పోతున్నారు కదా!

బ్రహ్మ : ఔను అన్నమాచార్యుడు ఆయన భార్య తిమ్మక్క ముందుగానే పోయినారు, మేము కూడా పోవలయును.

రోశ : మరి యింటిదగ్గర యేవరూ లేకుండా పోతేయెట్లాసోామీ!

రామం : ఎవరూ లేకుండా ఏమి? అన్నమయ్యతండ్రిగారున్నారు.

: సరేసోమి పాపంనావల్ల మీకు ఆలస్యంఅయింది బాగాతెల్లారేదాక తిరునాల సూడండిసోమీ! ఇంత సేపూ నేను దోవలోనేనిలబెట్టినాను దండాలు నేనుకూడా పోవాలి పనిచాలాఉంది.

(రోశయ్య వెళ్ళిపోవును)

ర్మ : (బ్రహ్మశాస్త్రితో) ఒరేయ్ బ్రహ్మం భలే విచిత్రంగాఉంది కదూ! మనకు పిల్లలపిచ్చి. పెండ్లిపిచ్చి. ఈ మీసాల రోశయ్యకు త్రాగుడుపిచ్చి, ధనపిచ్చి.

: ఒరేయి కల్యాణోత్సవము అయిపోయినట్లుంది. అడుగో అన్నమయ్య భార్యతోకూడాఇటేవస్తున్నాడు. ఇక మనంపోయి దేవుని ఊరేగింపు చూడవలసిందే, మనకు పెండ్లియోగం లేకపోతేపోనీ! కనీసం దేవునిపెండ్లి చూసేయోగం కూడా లేకుండాపోయింది.

(అన్నమాచార్యుడు తిమ్మక్కగార్ల ప్రవేశము)

: ఏమిటి మిత్రులారా! ఊరేగింపు చూడబోతున్నారా?

> : ఔనుసోదరా! పోయివచ్చెదము.

(రామశర్మ బ్రహ్మశాస్త్రి నిష్క్రమించెదరు)

: దేవీ! ఆ శ్రీనివాసుడు నీలాంటి అందగత్తెను, విద్యావతిని, కవయిత్రిని, నాకు అర్ధాంగిగా ప్రసాదించాడు. మొదట్లో వివాహమే వలదు సాంసారిక జీవనమేవలదు అన్న నాకు నీవు భార్యగా లభించుట మహాభాగ్యము.

క్క : పొగడకండి స్వామీ! మీ లాంటి ఉన్నతుడు. భక్తిపరుడు నాకు భర్తగాలభించుట నాపూర్వజన్మపుణ్యఫలము. ఆశ్రీనివాసునిదయ

: దేవీ! చూడు, ఆ భ్రమరములు పూలనుండితేనెను గ్రోలుచున్నవి ఆ చెట్టుపై గూటిలో పక్షులకేరింతలు అని (తిమ్మక్కభుజముపై చేయివేస్తాడు)

: అర్థమైనది మీకుచేయబోయేపని. ఇంటిలోన మామగారు నిద్రిస్తున్నారు. ఉత్సవాలకుపోయిన సోదరి అక్కలమ్మ ఏ సమయము నందైనా తిరిగిరావచ్చును. భక్తిలోను సంగీతసాహిత్యముల యందు రసపోషణలోను అగ్రగణ్యులైన తమరు శృంగార రస పోషణలోను అతిసమర్థులైయున్నారు.

అన్న : (నవ్వుతూ) నేటి చెన్నకేశవుని కల్యాణోత్సవము చూసినది మొదలు మనకు వివాహమైన మొదటిరాత్రి జ్ఞప్తికి వస్తున్నది. నేనొక పెండ్లి సంబంధమైన ఒక మంచి కీర్తన వినాలని పిస్తున్నది.

తిమ్మ : (చిరునవ్వుతో కొంచెం తడవుయోచించి) చిత్తము.

కీర్తన :
పిడికిట తలంబ్రాల పెళ్ళికూతురు
కొంత పెడమరచి నవ్వేనె పెళ్ళికూతురు ॥పల్లవి॥

పేరుగల జవరాలె పెళ్ళికూతురు పెద్ద
పేరుల ముత్యాల మెడ పెళ్ళికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లి కూతురు
విరుదు పెండెముపెట్టే పెండ్లి కూతురు ॥పిడికిట॥
మేర మీరుదు మగనికంటె పెండ్లికూతురు
పిర దూరినప్పుడె పెండ్లికూతురు
పతిపెదరేచి నిదిగో పెండ్లికూతురు ॥పిడికిట॥

(తిమ్మక్కను పట్టుకొని)
పెట్టనే పెద్దతురుము పెండ్లికూతురు నేడె
పెట్టెడు చీరలు గట్టె పెండ్లికూతురు
గట్టిగా వేంకటపతి కౌగిటను వడి
వెట్టిన నిధానమైన పెండ్లికూతురు

దేవీ! తిమ్మక్కా! సుభద్రా కల్యాణమను కావ్యమును ద్విపద రచనారీతిలో రచియింప ప్రారంభించితివికదా! సుభద్రార్జునుల శోభనమును ఏవిధంగా చిత్రీకరించితివో చెప్పగలవా?

తిమ్మక్క : ఆలాగేస్వామి! సుభద్రార్జునుల శోభనపు గదిని, ద్రౌపదియే అలంకరించినది. ఆమె ఆశయ్యాగృహాన్ని ఎట్లా అలంకరించినదో చెబుతాను.

ద్విపద :
దిక్కుల మాణిక్య దీపముల్ వెలుగ
నిలువుటద్దమ్ముల నెలత చెక్కించె
వెయ్యిదీపమ్ములు వెలుగంగ నందు
గవు సెనల్ దీయించెగాజు కంబముల
బంగారు తరికొళ్ల పట్టెమంచమ్ము
అంగన నెలయించి నమరించె సెజ్జ

సన్నని మల్లెలు జాజిమల్లెలును
బొండుమల్లెలు చాలనిండ బరపించి
యిరుదెసల్ తలగడ లిమ్ముగా దాపి
బంగారు సురటితా పడతి బెట్టించె

ఆహా! కడుసొంపుగా నున్నది యింపుగానున్నది. ఇక మన మునూ శయ్యా గృహమునకేగెదమా!

మ్మ : అబ్బ! ఎప్పుడూ శృంగారమే! అందుకే ప్రస్తుతము మీరు శ్రీ శ్రీనివాసులుపై కీర్తించు కీర్తనలెక్కువగా శృంగార రస మిశ్రితములై గానబడుచున్నవి.

ఆత్మావా ఇదమగ్ర ఆసీత్
తదైక్షత సోకామ యత
ఏకొహం బహుస్యాం ప్రజామేయ

దేవీ! ఆత్మసంకల్పమే మిథునముగ రూపొందినది. సృష్టి యంతయు దీని పరిణామమే. అథర్వణవేదమున కూడా కాముడే మొదట ఉద్భవించెనని కలదు. నవరసములలో శృంగార రసమునకే అధిక విశిష్టత. అదియే స్త్రీ, పురుషుల తాదాత్మ్య భావము. ఈ భావమే లేనంతవరకు మానవ సృష్టికి పరిపూర్ణత లేదు. రతి యనగ ప్రీతి, రతి శృంగారమునకు స్థాయి భావము. శృంగారము రెండు విధములు. ఒకటి సంభోగము, రెండవది విప్రలంబము. కవితకు పరమ ప్రియమైనది. విప్రలంబ శృంగారమే. దేవీ, నీవన్నట్లు నేను రచించు, ఆలపించు సంకీర్తనలయందు భక్తిభావ సమాశ్రితమైన శృంగారమున్నది. నేను నాయికనైన స్వామి నాయకుడు, అలమేలుమంగ నాయినయైన మంగతిపతి నాయకుడు ఆత్మనాయిక-పరమాత్మ నాయకుడు.

(నారాయణసూరి పరుగెత్తుకొని వస్తాడు)

రా : (గనపెడుతూ) కుమారా! మనయింటిలో మనం నిత్యం పూజించుకొనే వేంకటేశ్వర స్వాములవారి బంగారు విగ్రహం కనిపించుట లేదు. పెరటి గోడతలుపులు తెరచి ఎవడోదొంగ యింటిలో ప్రవేశించినట్లున్నది. ఏదో అలికిడైన శబ్దమైనది దీపము వెలిగించి. చూచాను ఇతరవస్తువులు ఏవిపోలేదు ఒక్క స్వామివారి విగ్రహం మాత్రం కనిపించటంలేదు.

అన్న : (ఆశ్చర్యముతో) ఏమీ! స్వామివారి విగ్రహము కనిపించలేదా? మనయింటిలో దొంగలు పడుటయా! కడు విచిత్రముగా యున్నది. దేవీ తిమ్మక్కా! నీవుకూడా లోనికిపోయి బాగుగా వెదకుము.

తిమ్మ : అలాగేస్వామీ! (నారాయణసూరి లోనికి వెళ్ళెదరు)

అన్న : స్వామీ! శ్రీనివాసా! ప్రతిరోజు నిన్నువేళకు పూజించేవాడినే, యీరోజు పూజకు వేళ అయినదే, మీ విగ్రహము దొంగలింప బడినదట, మరి నేను నిత్యమూ చేసే మీ పూజ ఎట్లా చేయుదును. చేయక ఎట్లా ఊరకుందును, స్వామీ వేంకటనాథా! వేంకటాద్రిని వెలసిన శేషమూర్తీ! ఓ అంజనీపుత్రా! పాతాళమున బంధింప బడిన ఆ దేవుని వెలికి తీసికొని వచ్చిన వాడవుకదా! మరి యిప్పుడు ఆ స్వామిని తీసికొనిరాలేవా? ఘోరమైన నాగములను సైతము పడగొట్టేవాడవు కదా. ఖగరాజా! ఆకాశమార్గాన హాయిగా విహరిస్తున్నావా? నా దేవుని తీసుకరాలేవా! ఓ సుదర్శన చక్రమా! ఈ తాళ్లపాక దేవాలయమున వెలశిన నీవు దుష్టులను సంహరించి అలసిపోయి ఉన్నావా? నా దేవుని తీసుకరాలేవా!

కీర్తన :

ఇందిరా రమణుని దెచ్చి యీయరో మా కిటువలె
పొంది యీతని బూజింప ప్రొద్దాయె నిపుడు ॥పల్లవి॥

ధారుణి మైరావణు దండించి రాము దెచ్చి
నేరుపు మించిన యంజనీ తనయా!
ఘోరనాగ పాశముల గొట్టివేసి యీతని
కారుణ్య మందినట్టి ఖగరాజ! గరుడా! ॥ఇందిరా॥

నానా దేవతలకు నరసింహు గంబములో
పానిబట్టి చూపిన ప్రహ్లాదుడా!
మానవుడవై కృష్ణు మహిమల విశ్వరూపు
పూని బండిమించు కొన్నపోటు బంటు యర్జునా! ॥ఇందిరా॥

శ్రీ వల్లభునకు అశేష కైంకర్యములా
శ్రీ వేంకటాద్రిపైన శేషమూరితి
కైవసమైన యట్టి కార్త్య వీర్యార్జునుడా యీ
దేవుని నీవేళ నిట్టెతెచ్చి మాకు నియ్యవే ॥ఇందిరా

వేంకటరమణా! ఆపద మ్రొక్కులవాడా! అనాదరక్షకా? ఆపద్బాంధవా! భక్తజనుల పాలిటి కల్పతరువువై, తత్వవేత్తల చిత్తమె నీవై ఎడబాయక కాపాడెదవందురే, మరి నేను భక్తుడ గానా? నా చిత్తమును నీ యందుంచే తత్వము నాకులేదా! ఎందు వలనస్వామీ! నాయిల్లు వీడి వెడలిపోయావు. నాలో ఏ పొరపాటు కల్గినదో చెప్పుస్వామీ! అనుదినము నిన్ను పూజింపనిదే అన్న పానాదులు ముట్టనుకదా! అమ్మా అలమేలుమంగా! స్వామిని నా చెంతజేర్చు తల్లీ!

ద్యం : చ॥ పరిమళమో! కదంబమో! ప్రభల్ విడనించిన నిగ్గొ నిర్మలా భరణమొ నిత్యవై భవమొ భాగ్యమొ శ్రీ యలమేలుమంగ భూ ధరునకు నాది లక్ష్మియని తత్వమహత్వ రహస్య వేత్తలం బరమున నుండి నీ వనిత ప్రస్తుతి సేతురు వేంకటేశ్వరా!
(పద్యము పూర్తి జేసి వెళ్ళిపోవును)

(మీసాల రోశయ్య ప్రవేశము) (ఉరుములు, మెరుపులు)

మ.రో : (బాధతో) అబ్బ! భరించలేకుండా యున్నాను యీ బాధ (విగ్రహమును చూపిస్తూ) దుడ్డుకాశపడి అయ్యగోరింట్లో ఈ దేముడు బొమ్మను దొంగిలించిన (బాధతో) అబ్బ అప్పటినుండి వళ్ళంతా బాధ, (చేతులు చూపిస్తూ) ఆ చెట్లపైనుండి కోతులు అమ్మో యెన్ని కోతులు నన్ను తరుముతున్నాయ్, అబ్బా నామీదపడి నన్ను చీల్చుతున్నాయి (నేలపై బడి బొర్లాడి లేస్తూ) అమ్మా, రక్తం, అబ్బా కండరాలన్నీ ఊడిపోతున్నాయి. అమ్మో అదిగో ఆకాశంనుండి గద్దలు, ఆ గద్దలన్ని నా పైకే వస్తున్నాయ్ (చేతులతో అడ్డగిస్తూ) అబ్బో కండ్లు నా కండ్లు (కండ్లుమూసుకొంటూ) పొడుస్తున్నాయ్. (తడబడుతూ) కండ్లు కనిపించడము లేదు. అదిగో పాములు ఒకటికాదు రెండుకాదు అమ్మో నాగుపాములు పడగలెత్తుకొని బుసలు కొడ్తున్నాయి. కాటువేయబోతున్నాయి అరె నన్ను చుట్టుకొంటున్నాయి (చుట్టూచూస్తూ) అబ్బ తల మొద్దు బారుకుంది నాలుక తడిఆరిపోతోంది. (గసపెడుతూ) (దూరంగా చూస్తూ) ఆ .. అదేదో గుండ్రంగా మెరుస్తూ నా పైకే వస్తున్నదే (వెనక్కుపరుగెత్తబోతు) ఆ... చక్రం

నా మెడకాయ (మెడను పట్టుకుంటూ) తెగకోస్తోంది. ఇంకనేను జతకను. ఇదంతా ఆ అన్నమయ్య మహిమే. ఇప్పుడుతెలిసింది. ఇక ఆయనే దిక్కు సోమీ అన్నమయ్యా! (గట్టిగాఅరుస్తూ) సోమీ! అన్నమయ్యా! అయ్యా! కాపాడుసోమి పడిపోతాడు.

అన్న ! [ప్రవేశించి) ఎవరో నన్ను గట్టిగా అన్నమయ్యా! కాపాడు అంటు అరచినట్లున్నది (అనిఅనుకొంటూ క్రిందపడియున్న రోశయ్యను చూచి] ఇతడే కాబోలు నన్ను పిలిచినది. ఓహో ఇతనిచేత స్వామి వారి విగ్రహము కూడయున్నది. దొంగిలించినది. ఇతడేకాబోలు స్వామీ! వేంకటేశా! ఈకలియుగంలో పలురకములైన ప్రాణులను పలువిధములైన ఆశలు కల్గిన మానవులను పుట్టించి జీవకోటిని ఆడిస్తున్నావా! అంతయూ నీ మహిమయే స్వామీ! యిది యెరుంగక జన్మయెత్తినది మొదలు చివర చచ్చువరకూ ఎన్నో దుష్కర్మలు జేస్తున్నారు యీ మానవులు,

సీ॥ ధనముండి యింకనూ దండిగా గడియింప
        పయనించు నవినీతి బాట నొకడు
    అధికార మిసుమంత యందుట కొఱకైన
        అకలి వారల జంపి యలరు నొకడు
    అనుచర వర్గమ్ము అన్యాయ మొనరింప
        న్యాయమంచును మెచ్చి నడుచునొకడు
    అందమైన మగువ నాలుగా గల్గియు
        పరకాంతల కొకడు ప్రాకులాడు

గీ॥ ఇల్లు గుల్లగా జేసియు పిల్ల లేడ్వ
    త్రాగి తందన లాడును ధరనొకండు
    జూద మందున బుద్ధిని జొనిపి యొకడు
    ఆలు బిడ్డల నైనను అమ్మ జూపు

ఈతడు స్పృహలోలేనట్లున్నది. పరికించి చూచెదను గాక (వంగి దొంగను తగిలి తట్టి లేపుతాడు)

మీ-రో ! ఆ.... ఏమిటీమాయ! పాములు, గద్దలు, కోతులూ, అన్ని ఎట్లా పోయినవి? మాయమైనాయే. నేనింకా సచ్చిపోలేదా? అరె కండ్లు

బాగానే ఉన్నాయె. కాళ్ళు చేతులు బాగానే ఉన్నాయ్. యిసిత్రంగా ఉండాదే (లేచి నిలబడి అన్నమయ్యవైపు చూచి) సోమీ! చమించండి. దొంగతనానికి పాలుపడ్డాను. మీ యింట్లో ఈ యిగ్రాన్ని దొంగిలించాను. అంతే అప్పటినుండి, సోమీ! అబ్బ! యేమి సెప్పేది. నరకయాతన అనుభవించాను. చచ్చిపోయాననుకున్నా! సోమి! (విగ్రహాన్ని చూపిస్తూ) ఇక ఎప్పటికి దొంగతనము చేయను సోమీ! యీ బొమ్మను తీసికోండి సోమి. ఇక తప్పుడు పనులు చేయను సోమి. బుద్దొచ్చింది, నాకు బుద్దొచ్చింది. (చెంపలు వేసుకొంటాడు) నన్ను చమించండి సోమి (అని పడిపోతాడు)

అన్న : నాయనా! ఈ లోకంలో తప్పులు చేయనివారులేరు. అయితే తప్పులు యెన్నిచేసినాకూడా చివరికి తాను చేసినతప్పును తెలిసికొని మళ్ళీ మళ్ళీ తప్పులు చేయకుండా ఉన్నవాడే మానవుడు. లేకున్న అట్లు తెలిసికొననివాడు మూర్ఖుడు, జంతువు అవుతాడు. పశ్చాత్తాపమునకు మించినది యేదీలేదు. (తనలో)

గీ॥ ఎన్నివ్యసనాల మానవుడున్న తుదకు
తప్పుదెలిసి పశ్చాత్తాప తప్తుడైన
వాడె యోగ్యుండు, పూజ్యుండు, కాడె, యితడు
అట్టికోవకు జెంది క్షమార్హుడయ్యె
అయ్యా! నీ పేరేమి?

మీ-రో : మీసాల రోశయ్య సోమీ! అదె ఆ పక్కనుండాదె, ఆమాలాడే సోమి మా వూరు

అన్న : రోశయ్యా! చేసినతప్పును తెలిసికొన్నావు. ఇక ఎప్పుడు యిట్టి తప్పునుచేయకు. మంచిగుణాలు కలిగి దేవుని భక్తితో పూజిస్తూ ఉండు.

రోశ : అయ్యా! అంటరానోడ్ని, నాకు మంచి, శడ్డా యేమి తేలీదు సోమి. నాకేగాదు, మా అయ్యాఅంతే మా తాతఅంతే.

అన్న : అదే మీరుచేసే పొరపాటు. మిమ్మల్ని మీరు కించపరచుకొంటారు తగిన విలువ మీరు సంపాదిస్తే అందరూ మిమ్మల్ని ఆదరిస్తారు.

సీ॥ మాదిగ కులజయై మదువ యరుంధతీ
దేవి, వశిష్ఠుని దేవి కాదె
బోయడై వాల్మీకి వ్రాయడే రఘురామ
చరితమ్ము గొప్పగా జనులు బొగడ
గురుభక్తిలో మేటి కులజుల మించిన
ఏకలవ్యుని కులమెఱుకగాదె
కులహీనులని చాల చులకగ పల్కుటల్
పాడియగునె సాటి ప్రజలనెపుడు

గీ॥ కులము కంటెను ముఖ్యమ్ము గుణమెకాని
గుణము లేనట్టియే గొప్ప కులజుడైన
ధరణి కులహీనుడని జెప్ప దగును మరియు
గుణము కలవాడె మించిన కులజుడౌను

రోశ : ఆహా సోమీ! యెన్నొ మంచి యిసయాలు శెప్పినారు అయ్యా! సోమీ! దేవలములో ఉండేవి ఉత్తరాయె. మీరేసోమీ! నిజంగా దేవుడు. దండాలుసోమీ దండాలు! (అని సాష్టాంగ నమస్కారము చేస్తాడు) (అన్నమాచార్యుడు రోశయ్యను భుజాలుపట్టి లేపుతాడు) అయ్యా! మీరు నన్ను తగిల్నారు నేను అంటరానివాణ్ణి అని తెలిసికూడా తగిలినారు. (ఆశ్చర్యముతో) ఈ ఊర్లో యెవ్వరూ మమ్మల్ని తగలనీయరు, దేవలంలోకికూడా రానియ్యరు. అట్లాటిది మీరు.... నన్ను........

అన్న : (చిరునవ్వుతో) చూడురోశయ్యా! హరినెఱిగినవాడు ఏ కులజుడైన నేమి? జగతిపై హితముగా చరియించువాడే, వగలేక మతిలోన బ్రతికినవాడే ధర్మతత్పరత బుద్ధిగలిగినవాడు. వేంకటేశు దాసుడైనవాడు, ఏకులజుడైన నేమి? ఎవ్వడైన నేమి? సర్వమూ సమానమే, అందరూ ఒక్కటే! చూడునాయనా ఆ సర్వాంతర్యామికి తల్లి దండ్రి గురువు దైవము ఐన ఆ దేవునికి అందరూ ఒక్కటే మనలను ఇహలోకంలో పడవేసిన జనకుడు అందరినీ ఒకేదృష్టితో చూస్తాడు.

కీర్తన : తందనాన ఆహి తందనాన పురే
తందనాన భళా తందనాన ॥పల్లవి॥

(పల్లవిని, రోశయ్యకూడా పలుకుతూ చేతులు జోడించి భక్తితో ఎగురుతాడు)

బ్రహ్మమొక్కటే–పర బ్రహ్మమొక్కటే–పర
బ్రహ్మమొక్కటే–పర బ్రహ్మమొక్కటే ॥తంద॥
కందువగు హీనాధికము లిందు లేవు
అందరికీ శ్రీ హరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మంతా ఒక్కటే
అందరికీ శ్రీ హరే అంతరాత్మ ॥తంద॥
నిండారరాజు నిద్రించే నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర అదియు నొక్కటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి ఒక్కటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే ॥తంద॥
అనుగు దేవతలకును అలకామ సుఖమొకటే
ఘనకీటకాది పశువుల కామసుఖమొకటే
దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
ఒనర నిరుపేదకును నొకటే అవియు ॥తంద॥
కొర విశిష్టాన్నములు గొను నాకలొకటే
తిరుగు మృష్టాన్నములు దిను నాకలొకటే
పరగ దుర్గంధములపై వాయు వొకటే
వరుస బరిమళములపై వాయు వొకటే ॥తంద॥
కడగి యేనుగుమీద గాయు యెండొకటే
పుడమి శునకము మీద బొలయు నెండొకటే
కడు బుణ్యులను పాప ఖర్మలను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే ॥తంద॥

(తిమ్మక్క ప్రవేశము)

తిమ్మ : స్వామీ! వేంకటేశ్వరస్వామి విగ్రహము కన్పించినదా?

అన్న : అవును తిరుమాలాంబా! ఇతడే సప్తవ్యసనముల బారినబడి మన యింటిలో జొరబడి విగ్రహాన్ని దొంగిలించాడు. అయితే ఏపూర్వ జన్మ పుణ్యఫలమో, ఆంజనేయుడు కోతిరూపముననూ ఆదిశేషుడు పాము రూపమునను గ్రద్దరూపమున గరుత్మంతుడు సుదర్శనము

చక్రరూపములోను కనిపించి యీతడు చేసిన తప్పుకు యీతనిని దండించి మన విగ్రహాన్ని మనకు తిరిగి యిప్పించినారు. వారి దర్శనము వలన యీతని పాపములు పటాపంచలైనవి. పంచమ కులస్తుడై కూడా పశ్చాత్తాపతప్తుడై పరమ హరిభక్తుడుగా మారబోతున్నాడు. దేవీ! ఇవిగో పండ్లు (పండ్లనిస్తూ) శ్రీనివాసునికి సుప్రభాతవేళ పూజగావించి ఈ ఫలములను నైవేద్యముగా సమర్పింపుము. (విగ్రహాన్నిస్తూ) ఈ విగ్రహాన్ని మన పూజా మందిరమున నెలకొల్పి అభిషేకాది కార్యక్రమముల నొనరింపుము. నేను ఈతనిని సాగనంపి వచ్చెదను.

తిమ్మ : అలాగేస్వామి! (విగ్రహాన్ని కళ్ళకద్దుకొని) వెళ్ళిపోవును)

అన్న : నాయనా! రోశయ్యా! ఇక దుర్వసనాలకు బానిస కాబోకుము. సుఖమయమైన జీవితాన్ని గడపుము. ఇతరులను శారీరకంగా గాని మానసికంగా గాని హింసించకు. నీకు చేతనైనంతవరకు ఇతరులకు సేవచేయుము, సత్కార్యములను జేస్తూ మనుగడ సాగిస్తే అగ్రకులజులకంటె నీవు అగ్రస్థానము నలంకరింపగలవు. సర్వదా నీమదియందు భగవంతుని దలంచుము. ఆ శ్రీనివాసుని పూజింపుము.

మీ.రో : (నమస్కరించి) యిక వెళ్లొస్తాను సామి. గోవిందా! వేంకటరమణా. (వెళ్ళిపోతాడు)

అన్న : ఓమ్ సర్వేత్ర సుఖినో భవన్తు సర్వేసన్తు నిరామయా!
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుః ఖమాప్నుయాత్
(నైవేద్యముగా పెట్టమన్న పండ్లలో తన దగ్గరయింకనూ మిగిలియున్న పండునొకదానిని తీసికొని నోటిలో ఉంచుకొని కొరికి)
ఈ పండ్లు పుల్లగామున్నవి అయ్యో దేవునికి నైవేద్యముగా బెట్టమని పంపితినే శ్రీనివాసునికి నా దేవునికి పుల్లని ఫలముల బెట్టుటయా? స్వామీ! క్షమించు. (లోనికి వెళ్ళును)

(తెరవాలును.)

## ద్వితీయ రంగము

(అన్నమాచార్యుని ఇల్లు, విగ్రహము దగ్గర పూజా నైవేద్యములు నారాయణసూరి కూర్చొనియుంటాడు తిమ్మక్క పూజచేస్తూ)

తిమ్మక్క శ్లో : ఓం వేంకటేశాయ విద్మహే
శ్రీ మన్నారాయ ధీమహీ
తన్నో శ్రీ శప్రచోదయాత్

శ్లో॥ ఫలాని జంబూ నారంగ నింబామ్రమ కదళానిచ,
గృహాణ బదరీ ద్రాక్షా నారికేళాని భక్షితుం.
ఓం వేంకటేశాయ నమః
ఫల వర్గం సమర్పయామి.

అన్న : (తొందర తొందరగా ప్రవేశించి) (చేతులు మోడ్చి) దేవా! వేంకటనాథా క్షమించు స్వామీ, తెలియక మీకు పుల్లని పండ్లను నైవేద్యంగా వుంచాము. తప్పుచేసితిని నా అపరాధమును మన్నించు తండ్రీ! శ్రీనివాసా! నారాయణా!

కీర్తన : నారాయణతే నమో నమో!
నారద సన్నుత నమో నమో! ॥నారా॥
మురహర భవహర ముకుంద మాధవ
గరుడ గమన పంకజ నాభ
పరమ పురుష భవ బంధ విమోచన
నరమృగ శరీరతె నమో నమో! ॥నారా॥

నారా : జలధి శయన రవి చంద్ర విలోచన
జల రుహ భవనుత చరణయుగ
బలి బంధన గోప వధూవల్లభ
నలి నోదరతే నమో! నమో! ॥నారా॥

తిమ్మ : ఆదిదేవ సకలాగమ పూజిత
యాదవ కుల మోహన రూప

అన్న : వేదోద్ధర శ్రీ వేంకటనాయక
నాద ప్రియతే నమో! నమో! ॥నారా॥

(టెంకాయను కొట్టి హారతిని తీసికొందురు)

అన్న : శ్లో॥ కాయేన వాచా! మన సేంద్రి యైర్వా
బుద్ధ్యాత్మనావా! ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

(తిమ్మక్క నారాయణ సూరికి పండ్లనిస్తుంది)

నార : (పండును నోట బెట్టుకొని) కుమారా! అన్నమాచార్యా! పండ్లు పుల్లనివని బాధపడితివే స్వామిదయవల్ల పుల్లనివికూడా తియ్యగ మారినవిచూడు!

అ.చా : పుల్లనైన పండ్ల భుజియింప బెడితినే
స్వామికనుచు బాధ పడుదు వేల!
తినియు జూచితివిగొ తియ్యగున్నవి పండ్లు
వీని రుచిని గనుము వేదనేల!

అన్న : (పండును నోటబెట్టుకొని రుచిజూచి) ఆహా ఏమీ ఆశ్చర్యము. దేవా! కరుణామయా నీలీలలు అద్భుతములు కదా! భక్తితోడ ఏమి సమర్పించిననూ మెచ్చువాడవు కదా!

చ॥ అటుకులు భక్తితో నిడగ నాదరణమ్మున నా కుచేలునిన్
పటుతర భాగ్యలక్ష్మి నిడి పాలన సేయవె! ఆ తెలుంగునన్
కుటిలత లేనిదై శబరి కోరల నంటిన పండ్ల బ్రీతితో
చటుకున నోటబెట్టుకొని జంకక తింటివె భక్త బాంధవా!

## పంచమాంకము ప్రథమ రంగము.

(అన్నమాచార్యులు యాత్రచేస్తూ టంగుటూరు ప్రవేశిస్తాడు-టంగుటూరు)

అన్న : మన ఆంధ్రదేశమున వెలసిన పుణ్యస్థలములు తప్పక సందర్శించవలసినవి యోగ్యమైనవి. ఈ టంగుటూరులో బాల్యమందు నేను చాలాకాలం ఇచ్చట గడిపాను. ఈ పురమందుగల కేశవ మూర్తి అనాధనాధుడు. నా బాల్యమిత్రుడు నరసింహుడిప్పుడు టంగుటూరు పరగణాధిపతియై యున్నాడట. అతని స్థితిగతులను గాంచెదగాక. అడుగో! భటులు వెంటరాగా నరసింహుడే యిటు వచ్చుచున్నాడు.

(నరసింహరాయులు, భటుడు ప్రవేశింతురు)

నరసిం : వందనము మిత్రమా! వందనము. కుశలమా!

అన్న : క్షేమమే నరసింహరాయా! మీరందరు క్షేమమేకదా!

నర : అందరము క్షేమముగాయున్నము మిత్రమా! నిన్ననే నీ విచ్చోటికే తెంచితివని తెలియ వచ్చినది. నీవు కేశవమూర్తి ఆలయంలో కీర్తనల నాలాపించుచుండ విన్న ప్రజానీకము ఏ గంధర్వుడో, లేక యే నారదుడో, తుంబురుడో వచ్చి పాడుచున్నట్లున్నదని అనుకొనుచుండగా విన్నాను యిప్పుడు నిన్నుచూడ వచ్చినాను.

అన్న : చాలా సంతోషము.

నర : (భటునితో) ఒరేయ్ వెంకన్న నీవు త్వరగా వెళ్ళి సత్రములో విడిదిగాయున్న అన్నమాచార్యులవారి సతీమణులను పుత్రులను మన భవనపు అతిథి గృహంలో ఉంచి వారికి తగిన వసతులు ఏర్పాట్లు చేయుము. ఏలాటి లోటు రాకూడదు సుమా!

భటు : చిత్తము అట్లే ఏర్పాటుగావింతును స్వామి. (వెళ్ళిపోవును)

నర తే.గీ॥ : స్వామి మీ యొక్క మహిమలు చాలదెలిసి
సంతసంబున తమతోడ సఖ్యమంద
కోరివచ్చితి దయచేసి కొరవబడక
నాదు నెలవున నివసింప నతులొనర్తు

నేనును నీవును బాల్యస్నేహితులము నీ దారివేరై గొప్పభక్తి కలిగి గొప్ప మహిమగలవాడవైతివి. ... మిత్రమా!

తే.గీ॥ : కృష్ణుస్నేహాన క్రీడికి కీర్తి పెరిగి
జగతి ప్రఖ్యాతి గాంచిన పగిది నాకు
మీదు సఖ్యంబు యశమును మిగుల పెంచు
ననుచు యాశించి బిల్చితి నార్యవర్య!

అన్న : తప్పక ఆలాగే వచ్చెదను.

నర : అన్నమాచార్యా! నీవు గొప్పగాయకుడవని విన్నాను. నీ నోట మంచి కీర్తన నొకదానిని వినాలనిపిస్తున్నది.

అన్న : ఆలాగే మిత్రమా! వినిపించెదను.

కీర్తన : ఊరులేని పొలిమేర పేరు పెంపులేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియ నేటికి ॥పల్లవి॥

ఉండరాని విరహవేదన వుండని సురత సుఖమేల
యెండలేని నాటినీడ యేమి సేయనె
దండి గలుగు తమకమనెడి తాలిమేల
రెండు నొకటిగాని రచన ప్రియము లేటికే ॥ఊరు॥

మెచ్చులేని చోట మంచిమేలు గలుగనేమి సెలవు
మచ్చికలేని చోట మంచి మాట లేటికే
పెచ్చు పెరగలేని చోట ప్రియము గలిగియేమి ఫలము
ఇచ్చలేని నాటి సొబగులేమి సేయనే ॥ఊరు॥

బొంకులేని చెలిమిగాని పొందులేని మనసులోన
శంకలేని కదియలేని చనువు లేటికే
కొంకుకొసరులేని మంచి కూట మలర నిల్లగూడి
వేంకటాద్రి విభుడులేని వేడు కేటికే ॥ఊరు॥

నర : (లేచి చిరునవ్వుతో) ఆహా! కీర్తన ఎంత మాధుర్యముగను భావ గర్భితముగను యున్నది. "ఊరులేని-పొలిమేర. పేరులేని-బ్రతుకు, గౌరవింపలేని-ప్రేమ విరహము లేని-పొందు. ఎండలేని నీడ, అర్థము సరిగాలేని-రచన, మెప్పు, ఆదరణ లేనిచోట ప్రేమ, చనువులేనిచోట-మంచిమాటలు, తననుమరపించని వానితోచెలిమి, యన్నవి వ్యర్థములు" అని నీవు కీర్తనలో పొందుపరచిన పదములు నేటి సామాజిక వ్యవస్థకు అద్దం పట్టినట్లున్నవి. మిత్రమా! అన్నమార్యా! నీవు దైవాంశ సంభూతుడవే, లేకున్న యిటువంటి పదకవితలల్ల యెవరికి సాధ్యము ఆచార్య! నా స్నేహము, ఆదరణ, ప్రేమలేనివి కావు. నేను రాజునైనను నా పట్ల నీకు యెంతో చనువున్నది. నీమంచి మాటలు నన్ను మరిపిస్తున్నవి.

అన్న : చాలా సంతోషము నరసింహరాయా!

నర : నీవన్నట్లు "పేరు పెంపులేని బ్రతుకు" వ్యర్థమే, ప్రస్తుతము నేను ఈ చిన్న పరగణానికి అధిపతిని మాత్రమే. మరింతగొప్ప రాజునై పేరు ప్రఖ్యాతుల గడించిననేగదా! ఈ జన్మకు సార్థకత

ప్రస్తుతం విజయనగర సామ్రాజ్యము కడుదీనస్థితిలో యున్నది, చిన్న చిన్నరాజులందరూ తమలో తాము పోట్లాడుకొనుచున్నారు. ప్రజల మంచి చెడ్డలను గమనించువారే లేరు. నాకు తగిన సామార్థ్యమున్నది. రాజ్య విస్తరణ గావించవలయునను కోరిక మెండుగా యున్నది, పొరుగు సంస్థానాధిపతులతో పోరు సల్పిన తప్పక విజయంచేకూర గలదని నా నమ్మకము. ఎన్నో మహిమలు కలవాడవు నీవు. మిత్రుడవు మరియు నా మేలు కోరెడివాడవు. నాఅశయ సిద్ధికి నేనుచేయవలసిన కర్తవ్యమేమిటో తెలియజెప్పుము మిత్రమా!

ఉ॥ : చిన్నతనంబునన్ మనము శ్రేయ మెలర్పగ టంగుటూరులో
మిన్నగ నాటలాడు చను మెల్గుచు నుండియు దారి దప్పగా
నిన్నటు దారి ద్రోసి తగనెమ్మది గూర్చిన దేనుగాదె, నీ
కెన్నియొ గల్గు.గా మహిమలెన్నగ నన్నిటు రాజుజేయుమా

అన్న : మిత్రమా! మనసునందు పట్టుదల ఉండవలయునుగాని మానవుడు సాధించనిది లేదు. అందునా రాజుకు ప్రజలలో పలుకుబడి ప్రేమ యున్నట్లైన సాధించుట మహాసులువు. సత్కార్యము చేయదలచిన, దైవము తప్పక నీడగానిలుచును. తప్పక విజయము సాధించగలవు, జగతిని ప్రఖ్యాతి బొందగలవు.

మ : జయమున్ బొందెదవుర్విలోన గల సంస్థానమ్ము లెన్నింటినో
స్వయమే గెల్తువు, శత్రువారిధికి నా చండాంశు చందంబునన్
భయమున్ జెందగ వెల్గెదీవు జగతిన్ ప్రఖ్యాతి బొందంగ రా
జయి, పెక్కేండ్లుగ రాజ్యమేలి, నరసింహాఖ్యుండజేయుండనన్

నర : ధన్యుడను మిత్రమా! కాదు. కాదుస్వామీ! మీ ఆశీస్సులతో శరీరముప్పొంగుచున్నది. ఇక పదండి స్వామీ విడిదికి వెళ్ళుదము.

అన్న : నరసింహరాయా! నీవు వెళ్ళుము, నేజేయు యాత్రను పూర్తిజేసి కొనీ నీవు కోరినట్లే వచ్చెదను.

నర : సరే మంచిది. మీ రాకకై యెదురు చూచుచుండెదను. (వెళ్ళిపోవును)

(రామశర్మ-బ్రహ్మశాస్త్రి ప్రవేశము.)

రాశర్మ : సోదరా అన్నమార్యా! నీ విక్కడ నున్నావని తెలిసి నీ సహాయము యాచించ వచ్చాము

బ్రహ్మ : ఔను మిత్రమా! నీవు తప్పక మాకు సహాయం చేయవలయును. లేకున్న నిన్ను వదలి పెట్టము.

అన్న : ఏమిటి సోదరులారా! నా సహాయము అవసరమైయున్నదా? ఏమి సహాయము కావలయునో.

రామ : తల్లిదండ్రి పరమ పదించిన పిమ్మట మీరు కుటుంటసమేతముగా ఊరువిడిచి యాత్రలకై బయల్దేరిరి. ఎక్కడెక్కడ తిరిగారో యేమేమి చేశారోగాని, మీ ఖ్యాతి నలుదిశల ప్రాకుచున్నది మీ మహిమలు చాలా గొప్పగా చెప్పుకుంటుండగా విన్నాము.

బ్రహ్మ : అన్నమార్యా! నాకు పెండ్లి కుదరబోవుచున్నది. ఔను అన్నమా నాకు కూడా పెండ్లి కుదరబోవుచున్నది

అన్న : ఇంతకాలానికి (నవ్వుతూ) సంసారకూపమున పడబోవుచున్నారన్నమాట

బ్రహ్మ : పెండ్లిఅయినప్పుడు మాట, కర్చులకు డబ్బులు కావలెను కదా!

రామ : ఔను మిత్రమా! పెండ్లి కుమార్తెవాళ్ళు కన్యాశుల్కము నివ్వనిదే పిల్లనివ్వరట.

బ్రహ : ఔనయ్యా! వాళ్ళకి డబ్బులివ్వనిదే పిల్లనివ్వరట. (దిగులుతో)

రామ : మరి మా స్థితి గతులు నీకు తెలుసుకదా! మా పెండ్లిభారము నీదే నయ్యా! అన్నమయ్యా!

బ్రహ్మ : సోదరా!

ఉ : ఎన్నగ విద్యలున్ మహిమ లెన్నియొ జూపి ధనమ్ము జేకురన్
కన్నియ లిర్వురన్ సతులుగాగాని సౌఖ్యము లొందెదీవుయే
పెన్నిధి లేని మా కెటుల పెండ్లగు నన్నమ! నీ వెఱుంగవే
అన్నిట మీ కుమాకు గల యాప్తత నైనను బెండ్లిసేయుమా!

రామ : చూడు అన్నమయ్యా! ఈలోకమే డబ్బుకు దాసోహమైపోతున్నది కన్యాశుల్కమివ్వనిదే మాకు కల్యాణ యోగం లేదు. నీ నైనా మాకు ధనసహాయం చేయకపోతే మా గతి యేంకాను. డబ్బు లేకుండా పెండ్లి జరిగె ఉపాయాలన్ని చూశాము.

సీ॥ ఏ తెంచి నారము యెందరి యిండ్లకో
కన్నెల నిమ్మని వన్నెలొలుక
బ్రహ్మ : యాచించి నారము అఖిల జనమ్ముల
పెండ్లి కొరకు డబ్బు పేర్మి గూర్ప
రామం : మోహించి నారము మోహనాంగుల నెల్ల
భేషైన భాషల వేషములను
బ్రహ్మ : ఊహించి నారము యువిదలు నిద్రింప
మెల్లగ యెత్తుక వెళ్ళదలచి
రామం : గీ॥ కాని, యిన్నిట నొకటైన కలిసిరాక
చిన్నతనమున నీతోటి చెల్మిదలచి
బ్రహ్మ : వచ్చినారము మా పెండ్లి బాధ్య తెల్ల
నీదె యగునోయి యన్నమా! నిశ్చయముగ

అన్న : సోదరులారా! నా దగ్గర మీరుఊహించినట్లు ధనము యేమియూ లేదు. నా మాటనమ్మండి. ఇది వాస్తవము. దేవునిపై భక్తియే కాని నా వద్ద యేమంత్ర తంత్రాలులేవు

సీ॥ అవనీశు లెందరో యగ్రహారము లివ్వ
వేంకటేశునకిచ్చి వేసినాడ
తాళ్ళపాక నుయున్న తల్లి దండ్రుల యాస్తి
దాయాదుల కునిచ్చి తరలి లిటకు
ధనము ధాన్యమ్ములు తాత్కాలి కమ్మని
దాచి యుంచగ మదిదలచనైతి
శ్రీనివాసుని నాదు చిత్తమ్ములో నిల్పి
పాడుచుండుటయె నా భాగ్యమనుచు

గీ॥ దలిచి జీవించు నా కెట్లు ధనము గల్గు
పెండ్లి మీ కెట్లు సేయుదు పేదనైతి
రండి మనమెల్ల వేంకట రమణుదలచి
భజన జేసిన యెనలేని భాగ్యమబ్బు

మిత్రులారా! ఆ శ్రీనివాసుడే ఆ శ్రీదేవియే కరుణింప వలయునే గాని నేను నిమిత్త మాత్రుడను. గాన మనమిప్పుడు ఆ యేడు కొండలవానిని వేంకటనాయకుడిని శ్రీ సతివల్లభుని శరణు కోరుతూ భజన చేయుదము

(అన్నమాచార్యుడు పాడును రామశర్మ, బ్రహ్మశాస్త్రి వంతపాడెదరు)

పల్లవి : శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీసతివల్లభా
శరణు రాక్షస గర్వ సంహర శరణు వేంకటనాయకా

చరణ : కమలధరుడును కమల మిత్రుడు కమలనేత్రుడు పుత్రుడు
క్రమముతో మీ కొలువుకిప్పుడు కాచినా రెచ్చరిక యూ ॥శరణు॥
అనిమిషేంద్రులు మునులు దిక్పతు లమర కిన్నర సిద్ధులు
ఘనతతో రంభాది కాంతలు కాచినా రెచ్చరికయా ॥శరణు॥
ఎన్నగల ప్రహ్లాద ముఖ్యులు నిన్ను గొలవగ వచ్చిరి
విన్నపము వినవయ్య తిరుపతి వేంకటాచల నాయకా ॥శరణు॥
(ఉరుములు మెరుపులు పైనుండి నాణెములు సొమ్ములుగలమూట క్రిందబడును)

రామ : సోదరా! కాదు కాదు స్వామీ అన్నమాచార్యా ఇదిగో డబ్బుమూట

బ్రహ్మ : (సంతోషముతో) ఆ మూటను విప్పిచూచి) స్వామీ! అన్నమాచార్యా! నీ మహిమ అద్భుతము.

అన్న : మిత్రులారా! ఇందు నా మహిమ యేమియు లేదు అంతయూ దైవకృప, భక్తితో ఆ దేవుని పూజిస్తే యేకష్టలు ఉండవు. కనికరించేవాడు మనలకాపాడేవాడు ఆ వేంకటేశ్వరుడే. ఈ మానవ కొటి కష్టాలు కలిగినప్పుడే దేవుని పూజిస్తారు కాని, సుఖంగా యున్నచో తనవరు.

చ॥ తలచరు మానవుల్ హరిని దండిగ సంపదలున్న వేళ, నా
కలిమికి మాదు ప్రజ్ఞయగు కారణమంచును గర్వబుద్ధి, నా
కలిమిదొలంగినన్ పిదప కారణమంతయు దేవు నెత్తినన్
చులకగ ద్రోచి వైతురిల చోద్యమదేమిటొ మానవళికిన్

ఇక ధనమును గైకొని వెళ్ళి పెండ్లిచేసికొని సంసారసుఖము అనుభవిస్తూ దైవకార్యములు మరువకండి ఆ వేంకటేశ్వరుని పూజించండి.

రా. బ్ర : స్వామీ! అన్నమార్యా! ఇకమేము వెళ్ళివచ్చెదము అనుజ్ఞయిమ్మ

అన్న : మంచిది క్షేమముగా వెళ్ళిరండి ఆ శ్రీనివాసులును సేవించండి.

(రామశర్మ బహ్మశాస్త్రి వెళ్లిపోవుదురు)

అన్న : అమ్మా! లక్ష్మీదేవి అవతారమైన పద్మావతీదేవీ! నీవు అభాగ్యుల పాలిటి పెన్నిధివి. ఓ అలమేలు మంగా, ఆర్తులై వచ్చిన నా మిత్రులకు ఆభరణాలు డబ్బులు అందజేశావు, స్వామీ వేంకటరమణా! అమితభాగ్యవతి శిరోమణిని అర్ధాంగిగాపొందిన నీవు ధన్యుడవు స్వామీ!

ఉ॥ : యోగ్యత లేని కష్టుడ నయోగ్యుడ నన్నిట జూడ గర్భని
ర్భాగ్యుడ, నీ కృపామతికి ప్రాప్తుడ, నో యలమేలుమంగ, నా
భాగ్యము నీ కృపాగరిమ ప్రాప్యము కావుమటంచు సారె నీ
భాగ్యవతీ శిరోమణిని ప్రస్తుతి చేసెద వేంకటేశ్వరా!

(తెరపడును)

(ద్వితీయరంగము : సాళువ నరసింహరాయల దర్బారు. పెనుగొండ)

నరసిం : (తనలో) అన్నమాచార్యాల ఆశీస్సులవల్ల, మహిమవల్ల,ఎక్కడో టంగుటూరున చిన్నదళాధిపతిగా నున్ననేను వినుకొండ మొదలు పెనుకొండవరకు రాజ్యవిస్తరణగావించి నేటికి గొప్ప రాజ్యాధిపతి నైతిని. యాత్రలకెళ్ళియున్న అన్నమాచార్యులను యీ పెనుగొండకు ఆహ్వానించుటకై పంపినభటులింకను రాలేదు. కొంతతడవు రాజ నర్తకి నాట్య విన్యాసము గాంచెదగాక (చప్పట్లు తట్టి) ఎవరక్కడ? రాజనర్తకికి కబురందజేయండి,

రా.నర్త : (ప్రవేశించి) ప్రభువులు శ్రీ సాళువ నరసింహురాయల వారికి ప్రణామము లు.

నర : నర్తకీ! ఏదీ నీ నాట్యవిన్యాసము. చూడదలచి పిలిపించితిమి వేసవిబాధా తప్తహృదయాల్లో శీతలపవనములు వీచునట్లు ఎంతో కాలమునుండి క్రూరుల, హీనుల, పాలనలో దీనంగా క్రుగ్గిన ఈ రాజ్య ప్రజాశోకపూరిత నయనాలకు అమృతధారలు కురిపించునట్లు, సాహస కృత్యములొనర్చి ఒడలంతయు అలసి సొలసి యేతెంచిన వీరశిఖామణుల శరీరంబులపై హిమబిందువులు వర్షించునట్లు, రోగపీడిత జనానేక నరాల్లోనికినివారణౌషధాన్ని జొనిపినట్లు, చరించలేని వృద్ధుల కంచణాల్లోనికి, శిరస్సు మొదలు పాదాలువరకు యౌవనశక్తినిఒసంగినట్లు, పసికూనల లేతమనస్సులోనికి హాయిగొలిపే జోలలా ఊండునట్లు, యౌవనదశలోనున్న యువతీ యువకుల రుధిరాల్లోకి మన్మధ శక్తిని జొప్పించినట్లు,

సప్తస్వరముల మేళవించి నీ యొక్క కోకిల స్వరంతో మృధుమధుర గీతాలను ఆలాపిస్తూ-నీ కాలిఅంధెలు ఘల్లు ఘల్లు మన మా మనసులు ఎల్ల సభికుల మనసులు ఝల్లు ఝల్లుమన, ఈ వేదికపై పురి విప్పిన మయూరివలె నాగస్వర నాదములకు ఊగిసలాడే నాగకన్యవోలె ఝంఝూ మారుత వేగంబులకు పరుగులిడు మేఘమాలికవోలె కాంతి ప్రభలతో ధళ ధళ ధళుక్కుమను విద్యుల్లతవోలె నింగికెగయు హిందూ కడలి కెరటాలవోలె, పర్వత శిఖరాల ఉద్భవించి భువికి ప్రవహించు జలపాత ధారవోలె, నర్తకీ! ప్రారంభించు నీ నాట్యాన్ని! ఆరంభించు నీ గానాన్ని, చూపించు నీ నటనాకౌశలాన్ని, ఆడుతూ పాడుతూ ఆడు! నా పరిపాలనా ప్రాభవాన్ని యినుమడింపజేసే విధంగా పాడు.

నర్తకి : చిత్తము మహారాజా!

(నాట్యము పాట)

ఏమని పొగడెదరా! యేలిక నిన్నును
ధీమత భీముని కాముని సముడవు ॥ఏమని॥

పెచ్చులు నీ దగు భీకర రూపమె
ప్రుచ్చుల యెడ యము బోలును రా
ముచ్చట యగు నీ మోహన రూపము
మచ్చెకంటుల కిల మదనా కృతిరా ॥ఏమని॥

తెలికన్నుల నీ తీక్షణ చూపులె
యిల, నీ, రిపులకు వెల వెలలూ
వలపుల యెడ నీ, వాల్గను చూపులు
పులకల రేపెడు పూవుల తూపులు ॥ఏమని॥

భేదించెడి యా, బెడిదాత్ముల యెడ
నీదగు పల్కులె నిప్పుల రవలు
ఆదరమగు నీ, మృదువగు మాటలు
సుదతుల యెడ సుధా రసజల్లులు ॥ఏమని॥

అరులకు, మఱియా, తరుణీ మణులకు
వెరపుల ప్రియముల, వెల్గెదవౌ ర

సరసుడ! సాళువ నరసింహాఖ్యుడ!
దరలో, నీ,సరి, దొర,గా నరా ॥ఏమని॥

(నర్తకి నాట్యమునకు మెచ్చి, రాజు నర్తకి మెడలో ఒకహారమును వైచును) (నాట్యము ముగియు సరికి రాజ భటుని ప్రవేశము)

: (నమస్కరిస్తూ) జయము! జయము! మహాప్రభూ! శ్రీ సాళువ నరసింహరాయలవారికి వందనములు. ప్రభువుల ఆనతిమేరకు శ్రీ శ్రీ అన్నమాచార్యుల వారిని వెదకుచూ వెళ్ళితిమి, గుంతకల్లు పట్టణమునకు సమీపమునగల కలశాపురము నందలి ఆంజనేయ స్వామి దేవాలయమున కన్పించిరి. ఆదరముతో ఆహ్వానించి తమ ఆరామ మందిరమున విడిదియేర్పాట్లు చేసితిమి. ఆచార్యుల వారు యిదే వచ్చియున్నారు.

సరే సత్వరమే సభలో ప్రవేశపెట్టుము (నర్తకితో) రాజనర్తకీ నీ నటనము, గానము మమ్ముచాల ఆనందింప జేసినది. సంతోషము, యిక నీవు వెళ్ళవచ్చును.

(అన్నమాచార్యుల ప్రవేశము)

: శ్రీ అన్నమాచార్యుల వారికి నమస్సులు.

: ధన్య వాదములు నరసింహరాయా!

ఉ॥ క్షేమమెయన్నమార్య! తమశిష్యులు మిత్రులు బంధుకోటులున్
మీమెయి భక్తిమార్గమున మెప్పును బొందుచు సంచరించి మీ
ప్రేమను చూరగొందురె, మరే విధమైన సమస్యలున్నవే,
మీ మది తృప్తియైనగతి మేల్మి ఫలించెనె యాత్ర ప్రీతిగన్

: ఆ శ్రీనివాసుని కృపవల్ల అంతయు కుశలమేరాజా!

: కుశలంబేకద నారసింహ! దగ నీకున్ నీదు భృత్యాళికిన్
శిశువుల్ బెద్దలు చుట్టుపక్కములు నీ క్షేమమ్ము కాంక్షించి నీ
యశమున్ బెంపును గోరునట్టి సఖులున్ అత్యంతప్రీతిన్ సదా
కుశలమ్మేల్ దగనీకు గూర్చ విబుధా కూటాల కెల్లప్పుడున్

: తమ ఆశీర్వాదబలమువల్ల అందరము కుశలమేఆచార్య! ఒకప్పుడు మీరిచ్చిన దీవెనలు ఫలించినవి. నేను గొప్ప రాజునైతిని. మీరాక కొరకై పెక్కుదినములనుండి ఎదురు తెన్నులు చూస్తున్నాను (ఆసనము చూపిస్తూ) ఆసీనులుకండిస్వామి!

(సభనుద్దేశించి) ఓ మంత్రివర్యులారా! సామంతులారా! సేనాధిపతులారా! రాజభటులారా! ఎల్లసభికులారా! వీరే శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులవారు. దైవభక్తి పరాయణులు సంకీర్తనాచార్యులు, పదకవితా పితామహులు మీరింతవరకు వీరి కీర్తనలను వాడ వాడలా ఎందరోగాయకులు పాడుచుండగా వినియుండ వచ్చు ప్రత్యక్షముగా వీరిని చూచి యుండకపోవచ్చు, కాన యీ రోజు ప్రత్యక్షముగా మన సన్నిధికి పిలిపింప వచ్చినారు. (అన్నమాచార్యులవారితో) స్వామీ! మీ యాత్రావిశేషాలేమి?

శా॥ : ఏయే క్షేత్రము లేగినారు మరి, యేయే రాజ్యముల్ జూచినా
రేయే వింతలు గాంచినారు, తమ కేయే దృశ్యముల్ నచ్చియు
న్నాయో దెల్పుముయన్నమార్య! అటభూనాధుల్ ప్రజాక్షేమమౌ
శ్రేయోధాయకమైన యట్టి విధులన్ జేపట్టినా రచ్చటన్

అన్న : నరసింహరాయా!

ఉ॥ : చూచితి పెక్కుదేశములు సొంపు దలిర్చెడు పుణ్యసీమలన్
రాచపు కొల్వు కూటములు రంజిలు పండిత వర్య సంఘముల్
దాచగనేల? రాజుల యదారత ధీరత దానశీలతన్
జూచితి, యగ్రహారముల సొమ్ముల నీయగ స్వామికిచ్చితిన్

రాజు : ఆహా! ఎన్నో పుణ్యక్షేత్రములు గాంచిన మీ జన్మ ధన్యమైనది. మా ఆహ్వానాన్ని మన్నించి విచ్చేసిన మీకు మా కృతజ్ఞతలు. స్వామీ అన్నమార్యా! మా సభలోని ప్రజలకు, మాకు, మీనాట ఒక మంచి రసవంతమైన కీర్తనను ఆలపింప, వినవలయునని కుతూహలముగా ఉన్నది. కానిండు

సీ॥ : రసముల రాజమై రంజిల్లు నెయ్యది?
విసిగింపనెలుగని రసమదేది?
గసవెట్టు నెటువంటి కష్టజీవులనైన
మిస మిసలాడించు రసమదేది!
సర్వ జీవులనెల్ల జంట జంటలు గూర్చ
పసగల్గు మేటియౌ రసమదేది!
చదివిన పాడినన్ శ్రవణాల కింపునై
రమియించి మురిపించు రసమదేది?

గీ॥ అట్టిశృంగార భరితమై యమరు నట్టి
మంచి కీర్తన కీర్తించి మమ్ము, ప్రజల
మిగుల రంజింప జేయుమా! మిత్రవర్య
అన్నమాచార్య కవివర్య! ఆర్యయిపుడు

అన్న : మంచిది. ఆలాగే రాజా!

కీర్తన

పల్లవి : ఏమొకొ చి కురుటధరమున యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు రాసిన పత్రిక కాదు గదా ॥ఏమొకొ॥

చరణము : కలికి చకోరాక్షికడ కన్నులు కెంపై తోచిన
చెలువంబిపుడిదేమో చింతంపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటినయా కొనచూపులు
నిలువున బెఱుకగ నంటిన నెత్తురు కాదు గదా ॥ఏమొకొ॥
పడతికి చనుగవ మెఱుగుల పైపై పయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుక ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలగ వేసవి కాలపు వెన్నెల కాదుగదా ॥ఏమొకొ॥
ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లులు చేర్పుల
వొద్దిక లాగులివేమో యూహింపరే చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల అందము కాదు గదా ॥ఏమొకొ॥

రాజు : ఆర్యా! మీగాన మద్భుతము, అసామాన్యము, సాటిలేనిది మేటియై నది. దేశకవితలో యీకీర్తన ఆహా! ప్రశంసింప శక్యముకానిది. ఊహింపతరము కానిది. (భటునితో) ఓరే సేవకా! అన్నమాచార్యులవారికి మన బహుమానముగా చీనాంబరములను కనక వజ్రమణిమయ ఆభరణాలను వారి విడిది గృహమునకు చేర్చి రమ్ము, (అన్నమాచార్యునితో) ఆర్యా! మీరు అన్యథా తలపక నాపై మకుటముపెట్టి ఒక్క కీర్తనను రచించి ఆలాపింపగోరు చున్నాను.

అన్న : అపరాధము రాజా! అపరాదము! శ్రీ వేంకటేశ్వరునపై పలికిన నానోట ఒక్కనరునిపై బలుకుటయా! తగదురాజా, నేను నీపై కీర్తన రచింపజాలను, లాపింపజాలను.

చం॥ : అనయము వేంకటాధిపతి నర్మిలి బల్కెడు నాదు నోటితో
మనుజుని బల్కుటే! అకట మానస మొప్పదు రాజవర్య! యీ
మనుజుల, జీవకోటులను, మాన్యత బ్రోచెడు దేవుడుండగా
పనివడి మానవున్బొగడ భావ్యము గాదయ సాళువాన్వయా!

రాజు : ఆహా! యేమి ఒక్క కీర్తనము బాడుటకా

కం॥ : కేవలమొక్కటె కీర్తన
ప్రావీణ్యముతోడ నాదుపై బాడమనన్
యేవేవొ, నడ్డు జెప్పుచు
భూవిభు నంచెరుగకైన బోవుటె యకటా!
ఐననూ నాపైన పాడమనుట అపచారమా! నన్ను ఒకమాములు
మానవునిగా దలంచుటయా!

కం॥ : నరసింహ నామధేయుడ,
పరమంబగు వైష్ణవమును పరమావధిగా
పరి తృప్తి నెంచు వాడను,
ధరణీశడ! కీర్తనమున దగనే బొగడన్

(తనలో)
సరియే కానిమ్ము కార్య సాధనకు సామదాన భేద దండో
పాయంబుల నన్నిటను పయోగించి చూచెదను. సామమ్మున
చెప్పిచూచితిని ఇక తర్వాత దానము ప్రయత్నించి చూచెదగాక.
(ప్రకాశముగ)
అన్నమాచార్య! ఈ నా చిన్న కోరికనుమన్నించి ఒక్క కీర్తన
నాలాపించండి, తమకేమి కావలయునో చెప్పండి, మడులా
మాన్యములా అగ్రహారమ్ములా ధనకనక వస్తువాహనమ్ములా లేక
వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య నీల
విద్రుమ మౌక్తికాది రత్నమ్ములా ఏవి ఐననూ సరియే కోరు
కొనండి వాని నన్నింటిని తక్షణమే మీ పాదాలచెంత వేయించ
గలను. దయయుంచి ఒక్క కీర్తనమును నాపేర మకుటముంచి
పాడమని వేడుకొంటున్నాను.

అన్న : నరసింహరాయా! నేను ఆ శ్రీనివాసునిపై తప్పబరులపై కీర్తింప
జాలను. సంపదపై ఆశయూలేదు, జీవితముపై మోహమూలేదు.

రాజా! గీ॥ : మడులు మాన్యమ్ములందున మమత లేదు
ధనము ధాన్యమ్ములననాకు దగులు లేదు
అస్థిరమైన యాస్తుల కాశలేదు
శ్రీనివాసుని పాద సంసేవదప్ప

న-రాజు : (తనలో) ఏమీ ఈ బ్రహ్మణుని గర్వము, ఎంతటి కండకావరము, యెంతగ ప్రాధేయపడిననూ కాదనుటయేనా? టంగుటూరు మొదలు పెనుగొండవరకు విస్తరించియున్న యీ భూమండలానికి అధిపతినై. ఐదువేల అశ్వదళము రెండువేల గజబలము మూడువేల ఓ్రష్టదళము పదివేల కాల్బలము-గల సైన్య సంపద గలిగిన వీరాధి వీర ధరాధిపతినై లక్షల వరహాలతో ధనాగారము నిండియున్న ధనాధిపతినై ఎచ్చోట కెళ్ళిననూ జైజై నరసింహరాయ! జై!జై! నరసింహరాయా! అని వేనోళ్ళ కొనియాడబడుచున్న భూపతిని, దీనులను, అనాధలను, అతిధులను, అభాగ్యులను, అబలలను, వృద్ధులను, పిల్లలను ఆదరించే దీనబాంధవుడను అయిన నన్ను, యీ బాపడు లెక్కసేయక నిండుసభలో నా యాజ్ఞనుల్లంఘించుటయా! యెంతటి అవమానము! ఛీ మదిదలంచిన నా శిరము నేల వ్రాలుచున్నట్లున్నది. (ప్రకాశముగ) అన్నమాచార్యా!

శా॥ : ఎందరు లేరు పో, కవులు యెన్నియొ కీర్తనలల్లలేదు యిం
కెందరొ గాన కోవిదులు యింపుగ వాగిని పాడలేదు, వా
రందరు రాజులన్ బొగడి యందరె మిక్కిలి భోగభాగ్యముల్
ఛాందస బుద్ధి నీ వలె, న నమ్మతి బల్కిరె దుర్మదాంధులై

అన్న : రాజా!

ఉ॥ : ఎందుకు రాజ! నన్ను కడు యెల్లిద మౌనటు మాటలాడ, నా
చందము నీ వెఱుంగవె! యచంచల భక్తిని స్వామి కీర్తనల్
విందువె పాడిచూపెదను వేల కొలందిగ, కాక నన్ను ని
ర్బంధము జేసి పాడమని పౌరుష వాక్కుల బల్కపాడియే

న-రాజు : అచంచల భక్తీయా! అహ్హ హ్హ హ్హ యేదీ తమరు యిప్పుడు పాడిన కీర్తనలోగల అచంచల భక్తి.

ఉ॥ : భక్తి దలిర్పగా హరిని పాడెద నాడెద నంచు బల్కి, యా
సక్తిని యాత్మ కామమున చక్కగ నిల్పియు స్వామిదంపతుల్
రక్తిని కామ కేళినిటు రంజిలుచుండి రటంచు పాడుటల్
యుక్తమె లోన చేదునిడి యొప్పగ తీపిని పైన బూయుటల్

అన్న : రాజా! నేను పాడిన కీర్తనలో తనుకు అర్థమైనదిది యేనా?
ఉ॥ : కాముకులైన వారికిది, కామము రీతిగ దోచుచుండు, ని
ష్కామ వివేచనంబునను, గాంచెడి వారికి, నాదు కీర్తనన్
కామిని యాత్మయౌను మరి కామికుడౌ, పరమాత్మ, ప్రేమ చే
నామెయి యిర్వురున్ గలిసి యైక్యము నొందుటె మోక్షమొందుటౌ

న-రాజు : ఆచార్యా! ఏమీ మీ అధిక ప్రసంగము.
ఉ॥ : నాదగు యాజ్ఞకన్ నిలిచి నాపయి కీర్తన వ్రాసి పాడుదో
లేద, యిదెంత లెమ్మనుచు లెక్కయె సేయక త్రోసి పుచ్చెదో
వాదన లేల నోయి విను! బాపడ! నీమది నిశ్చయించి యిం
దేదియు యిష్టమో యిపుడె యేర్పడ దెల్పుము వేగిరమ్మునన్

అన్న : మ॥ ధరణీ పాలక! యెందుకింత వెగటౌ దౌర్జన్యమున్ జూపుటల్
పరులన్ యూరక నిందజేసి యిటు వాక్పారుష్యమున్ సల్పి, నన్
వెరువన్ జేయగ జూతువేల! భువినా విశ్వాత్మునిన్ నమ్మి యే
నిరుడున్ భీతిని జెందబోడు వినుమేనాడైన నా మాటలన్

రాజు : శా॥ ఔరా! యెంతటి ధైర్య వంతుడవు నీ వాచార్య! నా యాజ్ఞకున్
ధీరత్వమ్మున నడ్డు జెప్పి ప్రభువున్ ధిక్కారమున్ జేతువే
యేరీతిన్ యిక బోవ నేర్చెదవౌ నిన్నిచ్చోట బంధించెదన్
ప్రారబ్ధమ్మిటు నీకు గల్గ తగలిన్ బ్రార్థించుటల్ బాడియే

న-రా అన్న : నరసింహరాయా! నన్ను బంధించెదవా?
ఉ॥ : బంధములందు జిక్కిపలు బాటల లాగెడి యింద్రియమ్ములన్
పొందిగ నాపలేక శ్రమ బొందుచు నిక్కము దెల్యలేని దు
ష్పాంథులు వేయుబంధములు బంధములౌనె! సతమ్మునాత్మ తన్
బంధన సేయువారి భవబంధము లూడ్చెడి దేవుడుండగన్

రాజు : రాజా నీఆజ్ఞ ప్రకారమే నన్ను బంధించండి. (అని ముందుకు
వచ్చును.

న-రాజు : భటులారా! యీతనిని తీసుకెళ్ళి సంకెలలు వేసి చెఱసాలలో బంధించండి. నా ఆజ్ఞను తు.చ. తప్పక పాటించండి. (భటుడు వచ్చి అన్నమాచార్యుని తొడుకొని వెళ్ళును.
(సభనుద్దేశించి) సభాసదులారా! రాజులకు ప్రజలు కన్నబిడ్డల్లాంటివారు. తల్లి దండ్రులు బిడ్డలకు పాలిస్తారు లాలిస్తారు. వారి కష్టాలపై సుఖాలపై శ్రద్ధచూపిస్తారు ఆ పిల్లలే తిరుగబడితే శిక్షిస్తారు. ఇప్పుడు అదేజరిగింది మీ రందరుచూస్తూనే ఉన్నారు కదా! నేనేమైన హిరణ్యకశిపునివలె నన్నే కొనియాడు అన్య దైవము లేదు, నేనే దేవుడను అని అన్నానా? లేదే కేవలం ఒక్క కీర్తన నాపేరు మీద మకుటం బెట్టి రచించి పాడమని కోరితిని, ఇంతమాత్రం ఇతరరాజు లెవరు కోరలేదా? ఆయాకవులచే వ్రాయించు కొనలేదా? పాడించుకొనలేదా? నేనుచేసినది నేరమా? రాజు చేయు సత్కార్యములు గురించి ప్రజలు ప్రశంసించవలె ఒకవేళ దుష్కార్యములు చేసిన యెడల విమర్శించవలె. అప్పుడే రాజుకు ప్రజలకు మధ్య అనుబంధము పెరుగుతుంది. ఓ మంత్రులారా! సామంతులారా! నేటితో సభముగిస్తాను, ఇక మీరందరు వెళ్ళవచ్చు.

భటుడు : (త్వరత్వరగా ప్రవేశించి) ప్రభూ! ప్రభూ!

రాజు : ఏమిటి సేవకా ఏమయినది?

భటుడు : ప్రభూ! తమరి ఆనతిమేరకు అన్నమాచార్యులవారిని సంకెళ్ళతో బంధించాము. ఆయన ఏదోపాట వేంకటేశ్వరుని మీద పాడినాడు, వెంటనే సంకెళ్ళు వాటికవే ఊడిపోయినవి స్వామి!

రాజు : ఏమీ! అన్నమాచార్యుడు కీర్తన పాడినంతనే సంకెలలు ఊడిపోవుటయా! కడు ఆశ్చర్యకరము, విచిత్రముగాయున్నది. ఏదీ పద ఇంతకూ మీరు సంకెలలు జాగ్రత్తగా వేసితిరా!

భటుడు : చాలా జాగ్రత్తగా వేసితిమి ప్రభూ! నిజముగా నమ్మండి.

రాజు : ఊహూ నేను నమ్మను మీ చర్యలో యేదోలోపముండి తీరవలెను. సరే ఈసారి నేనే స్వయముగా ఈ సభా ప్రాంగణములోనే అన్నమాచార్యునకు సంకెళ్ళువేసెద. వెళ్ళు ఆ అన్నమాచార్యుని వెంటనే తీసికొనిరమ్ము.

భటుడు: చిత్తం మహారాజ! (భటుడు వెళ్ళి అన్నమాచార్యుని తీసికొని వచ్చును. భటునిచేతిలో ఊడినసంకెళ్ళు తీసికొని రాజేస్వయంగా అన్నమాచార్యునికి సంకెళ్ళు వేస్తాడు)

అన్న : స్వామీ వేంకటనాథా! ఈ నరసింహరాయలు యేలనో నన్ను బాధించ తలచుచున్నాడు. నన్ను పరీక్షింప దలచుచున్నాడు. ఇతంతయూ నీలీల తప్ప వేరొండుకాదు. ఈ ఆ పత్సమయంలో నీవు తప్ప మరి దిక్కెవరు స్వామి!

కీర్తన : ఆకటి వేళల అలపైన వేళలను
తేకువ హరి నామమె దిక్కు మరి లేదు ||ఆకటి
కొఱమాలి యున్న వేళ కులము చెడినవేళ
చెఱవడి యొరులచే చిక్కిన వేళ
ఒఱపైన హరినామ మొక్కటె గతిగాక
మఱచి తప్పిన నైన మరిలేదు తెరగు ||ఆకటి
ఆపద వచ్చిన వేళ ఆరడి బడినవేళ
పాపపు వేళల, భయపడిన వేళ
ఓపినంత హరినామ మొక్కటె గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు ||ఆక
సంకెల బెట్టిన వేళ చంప బిలిచిన వేళ
అంకిలిగా నప్పుల వారాగిన వేళ
వేంకటేశు నామమే విడిపింప గతిగాక
మంకుబుద్ధి బొరలిన మరిలేదు తెరగు ||ఆక
వేంకటేశా! శ్రీ వేంకటేశా! హరీ! హరీ! హరీ! (సంకెళ్ళు వాటి ఊడి పోవును)

రాజు : ఆహా ఏమీ! ఆశ్చర్యము! అన్నమార్యా! మహాత్మా! క్షమించు స్వామీ! (అన్నమాచార్య పాదాలపై వ్రాలిపోవును)

అన్న : లెమ్ము రాజా! లెమ్ము (లేవనెత్తును)

రాజు : మహానుభావా! అన్నమార్యా! నన్ను మన్నించండి. రాజు గర్వంతో బలాఢ్యుడననే మదంతో ధనాఢ్యుడననే పొగ మీపట్ల చేయరాని నేరము చేసితిని. నీ అసాధారణ దైవ అరిషడ్వర్గాల మునిగిపోతున్న నాకు కళ్ళుతెరిపించినది. ఆ నా అపరాధమును మన్నించండి.

అన్న : రాజా! అంతయు ఆ శ్రీనివాసుని లీలలు తప్ప వేఱొండుకాదు. ఇందు నా మహిమ యిసుమంతయులేదు. ఆడేవాడు పాడేవాడు బాధించేవాడు బాధపడేవాడు సర్వమూ ఆ హరియే. ఇదితెలియని జీవులు జన్మించినది మొదలు మరణించువరకు "నాది-నాది-" అని ప్రాకులాడెదరు. రాజా! పశ్చాత్తాపమునకు మించిన మన్న నలు యేవిలేవు. నీవుపశ్చాత్తాప హృదయుడవై నావు అదియేచాలు ఇకమీద భక్తులను ఆదరింపుము, అపచారముల నొనరింపకుము.

రాజు : అలాగే స్వామీ!

అన్న : ఇకనేను ఈ సంసార సుఖంబులను ఈ మానవ సాహచర్యమును వదలి శ్రీవారి సన్నిధిలో తిరుమల-తిరుపతులలో చేరి ఆ వేంకటే శ్వరుని, శ్రీనివాసుని, కీర్తిస్తూ నా శేషజీవితాన్ని అచ్చటనే ముగించెదను.

సీ॥ : ఘనవిష్ణు యతి గుర్వు కాగ నేర్చితి భక్తి
సారమ్ము నాత్మలో చేరి నిల్వ
శఠకోప యతి దెల్పె సకల వేదమ్ముల
చేరి యహోబిల క్షేత్రమందు
తల్లి దండ్రులు స్వర్గ ధాములై వెలశిరి
జ్ఞాతు లెవ్వరు వెంట ప్రీతి రారు
వీట నెవ్వరు నాదు విజ్ఞత కోర్వరు
ప్రభువులనగ ప్రీతి బలుక రెపుడు

గీ॥ : కాన తాళ్లపాకను వీడి కదలి నేను
శ్రీనివాసుని తిరుమల క్షేత్రమునకు
చనియు నచ్చోట దేవుని సన్నుతింతు
శేషజీవిత మెల్లను సేవజేసి

(తెరవాలును)

(షష్ఠామాంకము — ప్రథమ రంగము)

(తిరుపతిలో-అన్నమాచార్యుని స్వగృహము. అన్నమయ్య కూర్చొని రచనలు చేస్తూ ఉంటాడు.)

అన్న : స్వామీ! వేంకటనాథా! దాచుకో నీ పాదాలకు తగనేజేసిన పూజలివిపూచే నీ కీరితిరూపు పుష్పములవియయ్యా! ఒక్క కీర్తనమె ఛాలు వొద్దికె మము రక్షింపగ తక్కినవి బాండారాన దాగియుండనీ, నా నాలుకపైనుండి నామ సంకీర్తనలు పూని నాచే నిన్ను బొగడించితివి ఇది అంతయు నీ యొక్క మహిమయే స్వామీ! ఇందులో నా యొక్క గొప్పతనము యేమియూ లేదు.

పెద్ద-తిరుమచార్యులు : తండ్రీ వందనములు.

అన్న : శ్రీనివాసార్పణమస్తు. కుమారా పెద్ద తిరుమలాచార్యా ఏమిటి విశేషములు? శ్రీనివాస మంగాపురము నందలి కల్యాణ వేంకటేశ్వరునికి నిత్యపూజలు సక్రమంగా జరుగుచున్నాయా? తిరుమలలోని కళాభవనమున గాయకులు మన కీర్తనలను ఆలాపిస్తున్నారా?

పెద్దతి : అన్నియును సక్రమముగనే జరుగుచున్నవి, తండ్రీ. ఆ కీర్తనలను విని కన్నడ వాగ్గేయ కారుడు శ్రీ పురందరదాసులవారు నిన్నుచూడ యిచ్చోటికి విచ్చేసి యున్నారు. మీ యనుమతియైన లోపలికి తీసికొని వచ్చెదను.

అన్న : ఆలాగా! సత్వరమే తోడ్కొని రమ్ము.

పెద్ద తిరుమలా చార్యులు బయటికిపోయి పురందరదాసుల వారిని తోడుకొని లోనికి యిరుపురు వస్తారు)

అన్న : (లేచి) కన్నడ కవితా పితామహా, పురందర దాసుగారూ ప్రణామములు. కూర్చొనండి. స్వామీ!

కం॥ : కన్నడ భాషా పదముల
మిన్నగు కీర్తనల వ్రాసి మెచ్చగ జగముల్
కన్నడ కవితపితామహు
నిన్నిట జూడంగా గల్గి నేధన్యు నికన్

పురం : ఆంధ్ర పదకవితా పితామహా! అన్నమాచార్యా! మీకివే నా నమస్సులు.

కం॥ : నీదగు పదములు వినగనె
నాదగు మదికెంతో ప్రీతి నచ్చెయు నిన్నా
మాధవు డైనట్టి విఠలు
గాదలచియు నిన్ను జూడగా వచ్చితిటన్

అన్న : చాలా సంతోషము స్వామీ! ఆ విష్ణు అంశయైన విఠలుని కీర్తించు మిమ్ములను జూసిన నాజన్మ చరితార్థమైనది.

పురం : నన్ను పొగడకండి ఆచార్యా! మీ ముందు నేనెంత? మణిదీపము యెదుట మిణుగురు పురుగులాంటివాడను. మీ పదకవితల ముందు మీ వేంకటేశ్వర స్వామి భక్తి యెదుట నే నల్పుడను. నేను రచించిన కీర్తనలలో నా పేరు తగిలించుకొని అమాయకుడనై మురిసిపోవుచున్నాడను. మీ కీర్తనలలో కేవలం వేంకటేశ్వర నామము తప్ప మీ పేరు యిసుమంతయు కానరాదు. మీరెంత వారో! మీ సర్వస్వం ఆ శ్రీనివాసునికే అంకితము చేస్తున్నారు. మీ కీర్తనలు కదుంమ్యముగాను, ఆహ్లాదకరముగాను, శృంగార, అధ్యాత్మిక, భక్తిపూరితముగాను యున్నవి. తిరుమల కొండపై పామరులు సైతము భజన రూపేణా పాడుకొంటున్నారు. మీరు రచించిన "శరణు శరణు సురేంద్ర సన్నుత" అనేకీర్తనను విని ముగ్ధుడనై నేనుకూడా అదే శైలిలో కన్నడ భాషయందు ఒక కీర్తన రచించితిని.

అన్న : స్వామీ! పురంధరదాసుగారూ! మీరు పాండురంగవిఠలుని పరమ భక్తులు. నన్ను పొగడకండి, మీరు రచించిన ఆ కీర్తనను వినిపించ ప్రార్థన.

పురం : ఆలాగే అన్నమార్యా!

కీర్తన : శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీ పతిసేవిత
శరణు పార్వతి తనయ మారుతి శరణు సిద్ధి వినాయకా ॥శరణు॥
నిటల నేత్రనె దేవిసుతనె నాగభూషణ ప్రియనె
తటిల్లతాంకిత కోమలాంగనె కర్ణకుండల ధారనె ॥శరణు॥
బుటువు ముత్తిన పదక హారనె బాహుహస్త చతుష్కనె
ఇట్టి తొడగియు హేమ కంకణపాశ అంకుశధారనె ॥శరణు॥
కుక్షియెళు మహాలంబోదరనె ఇక్షుచాప గెలిదనె
పక్షివాహన నాదపురందర విఠ్ఠలన నిజదాసనె ॥శరణు॥

అన్న : చాలా బాగున్నది. సంతోషము.

పురం : అన్నమాచార్యా! మీ కీర్తనలను పరులనోట వినుటయేగాని మీ నోట వినియుండలేదు. దయయుంచి ఒక్కకీర్తన నాలపించి నన్నానందింపజేయండిస్వామీ! అయితే ఒక్కవిన్నపము, నేను కన్నడ భాషినికదా! మరి అచ్చతెలుగున కీర్తనయున్న అర్థమగుట నాకుకొంచెము కష్టముగ యుండును.

అన్న : అలాగే సంస్కృత పదాల కీర్తనను ఆలాపించెదను.

కీర్తన : దేవ దేవం భజే దివ్య ప్రభావం
రావణాసుర వైరి రణపుంగవం ॥దేవ॥
రాజవర శేఖరం రవికుల సుధాకరం
ఆజానుబాహు నీలాభ్రకాయం
రాజారి కోదండ రాజ దీక్షాగురుం
రాజీవ లోచనం రామ చంద్రం ॥దేవ॥
నీల జీమూత సన్నిభ శరీరం ఘన వి
శాల వక్షం విమల జలజ నాభం
తాలాహి నగహరం ధర్మ సంస్థాపనం
భూలల నాధిపం భోగిశయనం ॥దేవ॥
పంకజాసన వినుత పరమ నారాయణం
శంకరార్జిత జనక చాప దళనం
లంకా విశోషణం లాలిత విభీషణం
వేంకటేశం సాధు విబుధ వినుతం ॥దేవ॥

పురం ఆహా! వీనుల విందుగా శ్రీ రాముని వర్ణించారు స్వామీ! ఇకనాకు సెలవు యివ్వండి అన్నమాచార్యా!

అన్న : (పె.తిరుమలాచార్యునితో) కుమారా! పెద్దతిరుమలయ్యా! శ్రీ పురందరదాసుగారిని సాగనంపిరమ్ము.

(పెద్దతిరుమలాచార్యులు-పురందరదాసు నిష్క్రమించెదరు)

అన్న : (కూర్చుండి కీర్తనలను వ్రాయ మొదలుపెట్టును)
భావములోన బాహ్యమునందున
"గోవింద గోవింద" యని కొలువవె మనసా
విష్ణుని మహిమలె విహిత కర్మములు
విష్ణుని బొగడెడి వెవేదంబులు

(విష్ణుడొక్కడె విశ్వాంత రాత్ముడు ఓ మనసా!
విష్ణువు విష్ణువు యనివెదకవే

(పెద్దతిరుమలాచార్యుల ప్రవేశము)

పె.తి : తండ్రీ! శ్రీ పురందర దాసులవారికి వీడ్కోలు చెప్పివచ్చితిని.

అన్న : కుమారా పెద్దతిరుమలయ్యా! నాకు వయసు మీరిపోయినది. యిక దైవకార్యాలు నీవూ నీ కుమారులు చేయవలసినదే, నాముద్దుల మనుమడు, చిన్నన్న, వాడే తిరువేంగళ నాథుడు శ్రద్ధగా విద్యనభ్యసిస్తున్నాడు, పెద్దమనుమడు చిన్న తిరుమలయ్యను చూచి చాలారోజులైనది. మీ తల్లులు మరణించిననూ నిన్నూ మీ అన్న నరసింగన్ననూ గొప్పగా జేసితిని. నాకు కాలము సమీపించుచున్నట్లున్న. నేను వెళ్ళిన పిమ్మటకూడా మీరు ఆ హరిని మరువకండి.

పె.తి : అలాగే తండ్రీ! మేముకూడా మీ వలెనే వేంకటాచలాధిశునికే మా జీవితాలను అంకితము చేసెదను.

పద్య ఉ : ఆ రవి తారకంబుగ నుదాహరణంబు రచించె భక్తి వి
స్తారత తాళ్ళపాక పురశాసనుడన్నయ తిమ్మనార్యు డిం
పారగ జక్రనందక గదాంబుజధారికి శ్రీ వధూ మనో
హారికి వేంకటాచల విహారికి శౌరికి నంకితంబుగన్

## ద్వితీయ రంగము

(తిరుమలలో అన్నమయ్య స్వగృహం–అన్నమయ్య 95 సం॥ ముసలివాడు–మాట తడబాటు–నడక తడబాటు)

న్న : స్వామీ! వేంకటనాథా! వయసుమీరిపోయినది, నేటికి తొంభై ఐదు సంవత్సరముల ఆయుస్సు నిండినది. నోట మాట పొరబడు చున్నది. కాలినడక తడపడుచున్నది. కంటిచూపు సరిలేదు, కంఠ[శావ్యతనూలేదు. శ్రీనివాసా! ఇక నిన్ను కొనియాడ నిను కీర్తింప బూజింప చాలినంత శారీరక ఫటుత్వము లేదు. ఇకనుండి నిన్ను సేవించు భాగ్యము నా కుమారులు, నా మనుమలదే తండ్రీ! పదునారేండ్ల వయస్సునుండి నిన్నటివరకు ముప్పది రెండువేల కీర్తనలు మీపై రచించి కీర్తించితిని, వైష్ణవమే పరమావధిగా జీవించితిని. ఘన విష్ణువు శఠకోపయతి మున్నగు మహనీయుల బోధనలను నేర్చి ప్రజానీకమునందు భగవద్భక్తిని నాటితిని, ఎందరో ధనవంతులు మెచ్చి యిచ్చిన సొమ్మును అంతయునూ మీసేవలకై మీ పూజలకై వెచ్చించితిని.

తండ్రి శ్రీనివాసా! ఈ శరీరముపై మోహమికలేదు ఈజన్మ మికచాలు తండ్రీ? సప్తగిరివాసా! నిన్నే నమ్మినాడను, నీ పాద దాసుండను. నీ రూపునే నా మదిలో నిల్పుకొన్నాడను. నీ నామ స్మరణే ధ్యేయంగా పెట్టుకొని క్షణ క్షణము ఉచ్చరించువాడను. ఈ మానవ జన్మలో ఈ కన్నులతో ఒక్కసారి కలియుగ అవతార మైన మీ రూపాన్ని కన్నులారా చూడాలన్న ఆశ మెదలాడు చున్నది. నారాయణా! ఆపద్బాంధవా! అనాథరక్షకా! ఈ నీ భక్తుని మొరాలకించి ఒక్కసారి సాక్షాత్కరించు తండ్రీ! నేటి వరకు ఏనాడూ ఈ కోరిక కోరియుండలేదు. కదాస్వామీ! ఏనాటి పాపఫలమో, లేక పుణ్యఫలమో! ఏమి మీ ఆశయమో! నాకు ఈ మనుష్యజన్మ నిచ్చారు. ఇకవలదు తండ్రీ! ఒక్కసారి నా కన్నులకు కనిపించి నన్నునీలో ఐక్యంచేసుకో స్వామీ! శ్రీహరీ! శంకచక్రాదులతో దివినుండి భువికి దిగిరాలేవా! ఆశగా ఉందయ్యా నినుచూడాలని. తండ్రీ! ఏనుగు అరిస్తేనే పైనుండి పరుగెత్తుకొని వచ్చావుకదా శ్రీపతీ! నేను ఇంతసేపు

పిలుస్తున్నా నీకువినిపించుట లేదాస్వామీ! ఈ ముసలిపీనుగు ఎంతసేపని నిన్ను ప్రాధేయపడగలదు మహానుభావా? ఇంద్రి యాలన్నీ నామాటవినమని మొండికేస్తున్నాయి నా ఆత్మ ఏ పరమాత్మా! యని ఘోషిస్తున్నది. రాయిగా ఉలకక పలుకక ఉండిపోయిన అహల్యకు సైతం కనిపించితివికదా! శ్రీ రమా హృదయేశ్వరా! బాల్యమాదిగా నిన్నే తలుస్తూ కొలుస్తూ యున్నానే నాయీ కోరిక తీర్చలేవా?

అంధుడైన దృతరాష్ట్రునికి సైతము నీ విశ్వరూపాన్ని దర్శించు భాగ్యము కల్పించితివికదా! మరి నాకెందుకు ఆ అదృష్టాన్ని ప్రసాదించకున్నావు ఈ మానవ జన్మలో నేనేదైనా మీ పట్ల ఎనరాని తప్పులు ఒనరించితినా తండ్రీ! అట్లైన నన్ను మన్నించు నీ పుత్రుడనే దీనంగా అయ్యా కని పించవా? అని ఏడుస్తూఉంటె కనిపించవే కన్నతండ్రీ!

అమ్మా! అలమేలుమంగా! బాల్యంలో స్వామిని చూడాలని వచ్చి ఈ కొండలలో అలసి సొలసిననాకు అన్నపానాదులనిచ్చి ఆదరించితివికదా! తల్లీ! మరిప్పుడు ఊరకున్నావే అమ్మా! ఒక్కసారి స్వామిని చూడాలనిఉంది తల్లీ! కనికరించవమ్మా!

తండ్రీ మాధవా! నీవు కనిపించలేదని భాదతో కోపంతో ఏమోమో వాగుతున్నాడను తండ్రీ! నన్ను మన్నించి యీ నా కన్నులకు దర్శనభాగ్యము కల్గించి నన్నునీలో కలుపుకోస్వామి. ఇక నాకు యీజన్మవద్దు ఈ లోకంలో నేను ఉండలేను స్వామీ!

(పద్మాసనం వేసుకొని)

అన్న : ఓం నమో నారాయణాయ. ఓం నమో నారాయణాయ (అని పలుమార్లు జపిస్తూ ఉంటాడు) (ఉరుములు మెరుపుల మధ్య శ్రీనివాసులు ప్రత్యక్షమౌతాడు)

వేంకటేశ్వర్లు : భక్తా అన్నమా!

అన్న : (కనులు తెరచిచూచి ఆనందముతో) స్వామీ శ్రీనివాసా వచ్చావా! ఈ భక్తుని మొర ఆలకించి వచ్చారా! స్వామీ ధన్యుడను తండ్రీ ధన్యుడను.

దండకము : శ్రీ వేంకటేశా రమేశా హృషీకేశ శ్రీ స్వప్రకాశా! ధరన్ శేష
శైలాగ్రవాసా సువేషా సుభూషా సుభాషా పరంధామ సుత్రామ
శ్రీరామ వైకుంఠధామా! సునామా సుధీమా సుభీమా సుఫాలా
సుగోపాల చిద్రూప సుద్రూప ఓంకార రూపా! నమో దివ్యతేజా
నమో దేవదేవా నమోనాదు చిత్తమ్మునన్ నీదు రూపమ్మునున్
నిల్పి నిత్యమ్మునే కాగ్ర చిత్తమ్ముతో గొల్చి నా జీవితంబెల్ల
నీ సేవలో ముగ్గి నీ కీర్తనల్ బాడి నీ యాటలన్ ఆడిలోకమ్మునం
దెల్ల నీ కీర్తి వ్యాపింప నీ శక్తి దీపింప గావించితే స్వామి
యీ నాడు వృద్ధుండనై నేను యున్నాడ చాంచల్యమై బుద్ధి
స్వాదీనతన్‌లేదు కోల్పోయె దేహమ్ము సామర్థ్యమున్‌చాల నేనుండ
నీ యుర్వి నింకొక్క జామైన నీ పాదదాసుండ నిన్‌జేర
యున్నాడ నీకంటె నాకింకదిక్కెవ్వరో స్వామి నీ దివ్యతేజాన
యీ దివ్యతేజాన్నిలీ నమ్ముగావించి పాలింపవే స్వామి శ్రీ శ్రీని
వాసా చిదానందవాసా నమస్తే! నమస్తే! నమః!

వేంక : నాయనా! అన్నమా! నీవు కారణజన్ముండవు. భక్తులు నన్ను
యేరూపములో భావించి తలుస్తారో నేను అదే రూపంలో వారికి
సాక్షాత్కరిస్తాను. కృతయుగంలో వామనుడను, నరసింహుడను,
నేనే, త్రేతాయుగంలో రాముడను, ద్వాపరంలో కృష్ణుడను,
ఈ కలియుగంలో తిరుమల వేంకటేశ్వరుడను నేనే,

భూమిలోను జొచ్చి సర్వభూత ప్రాణులనెల్ల
భీమకాన మోసేటి దేవుడ నేను
పాలించి సఖ్యములు కలిగించి చంద్రుడనై
జీవుల మన్నించేటి దేవుడనేను
శ్రీదేవితో కూడి శ్రీ వేంకటాద్రిమీద
పాదైన దేవుడను భావింపనేను

అన్న : ధన్యుడను దేవా! ధన్యుడను.

వేం-శ్లోకం : మాము పేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన సంసద్ధిం పరమాంగతాః

నిశ్చల మనస్సుతో నిర్మలులైన సదానన్ను స్మరించినవారికి
నేనుసులభంగా లభ్యమయ్యేదను. నన్ను పొందిన మహాత్ములు

అత్యుత్తమ సిద్ధియగు పరమాత్మ పదవిని బొందెదరు. ఈ లోకంలో మరలా వారు జన్మించరు. వారికి పునర్జన్మలేదు, అయితే ఈ యుగంలో సుఖం కోరని ప్రాణిలేదు. దుర్వ్యసనాల పాల్పడని జీవిలేదు. అందరు అజ్ఞానము వలన స్థిరము, సత్యము నైన, సుఖమెక్కడ కలదో, ఏదిశాశ్వతమో, ఏది అశాశ్వతమో, యెరుంగరు చీకటిలోనిపురుగులవలె దుఃఖాన్ని అనుభవిస్తున్నారు

శ్లోకం : అపిచేత్సుదురాచారో భజతేయామనన్యభాక్
సాధురేవ సమంత్యవ్యః సమని గ్వ్యవసితో హినః
క్షిప్రం భవతి ధర్మాత్మాశశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి!

పరమ దుర్మార్గుడైననూ పశ్చాత్తాపముతో పాపచర్యలను విడనాడి అనన్య మనస్కుడై నన్ను ఆరాధించినచో వాడుకూడా సాధువై అచిరకాలములోనే పాపరహితుడై శాశ్వత శాంతిని పొందును. మానవుడు దేహాన్ని విడిచేస్తాడు కాని వాని, వాని కర్మలనుబట్టి వాని ఆత్మ తిరిగి తిరిగి వేరేదేహముల చేరుతూ ఉంటుంది.

అన్న : దేవా! ఇకనాకు వేరేదేహమూ వలదు. ఈ ఆత్మభ్రమణమూ వద్దు పరమాత్మవు నీవు, నా ఆత్మను నీ నుండి వేరుచేయకు స్వామీ!

వేంక : అన్నమా! ఈ కలియుగంలో ప్రతిప్రాణి దేహమునుండి వేరగు వరకు ఐహికసుఖాలకు బానిసయగుచున్నది. అందువల్లే పుట్టుక, చావు అనునవి ఆయా ఆత్మల నావరించి పరిభ్రమిస్తున్నాయి. ఆత్మనుగురించి తెలిసికొనలేక పోతున్నాయి.

ఆ.వె. : దేహి గానివేళ దేహియు నగువేళ
దేహమట్టి వదలి దెరలు వేళ
ఆత్మ నిత్యమగుచు నలరారు నెప్పుడు
నాశమందబోదు నవియ బోదు

అన్న : దేవా! ఆదిపురుష అనంతకోటి బ్రహ్మాండ నాయకా! మీ విశ్వమయమైన రూపాన్ని గాంచిన నా ఆత్మ మిమ్ములను ఎప్పుడెప్పుడు చేరగలనా అని ఉవ్విళూరు చున్నది. తండ్రీ! శ్రీహరీ! ఈ యుగంలో మీ నామజపం ముక్తికి మార్గం కదా స్వామీ!

శ్లోకం : హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా

(స్వామీ! ద్వాదశి ఘడియలు ముగియకముందే నన్ను తమలోనికి చేర్చుకొనండి ప్రభూ! (సాష్టాంగ నమస్కారము చేయును)

ేంక : తథాస్తు అన్నమా! నేనిదే నిన్ను నాలో ఐక్యం చేసికొంటున్నాను నీ ఆత్మజ్యోతి అండపిండ బ్రహ్మాండ మంతయు నిండియున్న నా అఖండమైన శారీర ప్రకాశంలో లీనమై పోవుచున్నది. ఖడ్గాంశమున బుట్టిన నీవు తిరిగి నా యొక్క బిరుదు గజ్జెల ముప్పిడి కఠారమున లీనమైపోదువుగాక. నీవురచించిన కీర్తనలు ఆలపించినవారికి, వినినవారికి, మోక్షప్రాప్తి కలుగునుగాక! ఈ కలియుగాంతమువరకు నాకు, నను సేవించిన నీకు ప్రజల హృదయాల్లో చెరగని స్థానము లభించుగాక (అన్నమాచార్యుని ఆత్మ, జ్యోతిరూపంలో శ్రీనివాసుని దేహంలో లీనమైపోవును)



## సప్తమాంకము

(తిరుపతి పెద్దతిరుమలాచార్యుని గృహము) పె. తి. చిన్నన్న)

పె.తిరు. ఈ విధంగా మీ తాతగారు ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు పరమపదించిరి. కుమారా! చిన్నన్నా! మీ తాతగారి చరితను సానుకూలంగా వింటివి కదా!

చిన్న : విన్నాను తండ్రిగారు, తాతగారిది ఎంత మహనీయమైన చరిత్ర తండ్రీ.

పె తిరు: కుమారా! మా తండ్రిగారి వర్ధంతి బహుళ ద్వాదశినాడు ప్రతి సంవత్సరము జరుపుకొనుచున్నాము కదా! అందునిమిత్తమై మనం ఆనాడు ఆలపించుటకై ఒక కీర్తనను రచించితిని వినిపిస్తాను విను

కీర్తన : దినము ద్వాదశి నేడు తీర్థదివసము నీకు
జనకుండ అన్నమాచార్యుడ విచ్చేయవే ॥దినము॥

అనంత ముఖ్యులైన సూరిజనులతో
ఘననారదాది భాగవతులతో
ధనుజ మర్ధనుడైన దైవశిఖామణి తోడ
వెనుకొని యారగింప విచ్చేయవే ॥దినము॥

వైకుంఠాననుండి యాళువారల లోపలనుండి
లోకపు నిత్యముక్తుల లోననుండి
శ్రీకాంత విభుడైన శ్రీవేంకటేశుగూడి
యాకట నారగింప విచ్చేయవే ॥దినము॥

సంకీర్తనముతోడ సనకాదు లెల్లబాడ
పొంకపు శ్రీ వేంకటాద్రి భూమినుండి
లంకె శ్రీ వేంకటగిరి లక్ష్మీ విభుడు నీవు
నంకెల మా యింట నారగించవే ॥దినము॥

చిన్నన్న : తండ్రీ! చాలాబాగున్నది. శ్రీ వేంకటేశ్వరుని పట్ల యున్న భక్తికి ఎంత మహత్తు యున్నదో శ్రీనివాసుని భక్తుడైన తాతగారి చరిత్ర కూడా అంతటి ఔన్నత్యము కల్గియున్నది.

ద్విపద : మనసున గపటంబు మాని సద్భక్తి
నవఘుమౌ నీ యన్నమాచార్యా చరిత
వినిన వ్రాసిన బేరుకొనిన జదివిన
జనులకు నిష్టార్థ సౌఖ్యమ్ము లొదవు

తండ్రీ! నేను తాతగారి చరితను "అన్నమాచార్య చరిత్ర" అనుపేర ద్విపద కావ్యముగా రచించుటకై త్వరలో ప్రారంభించెదను.

పె.తిరు : మంచిది చిన్నాన్నా!

కీర్తన : జయమంగళము నీకు సర్వేశ్వరా
జయమంగళము నీకు జలజవాసినికి ॥జయ॥

శరణాగత పారిజాతమా
పొరిన సురల పాలి భూతమా
అరుదైన సృష్టికి నాది మూలమా
హరి నమో పరమపుటాల వాలమా ॥జయ॥

చిన్నన్న : సకల దేవతా చక్రవర్తి
వెకలిపై నిండిన విశ్వమూర్తి
అకలంకమైన దయానిధి
వికచ ముఖనమో విధికివిధి ॥జయ॥

పె.తిరు : కొలచిన వారల కొంగు పైడి
మొలగిన వారికి మొన వాడి
కలిగిన శ్రీ వేంకటరాయ
మలసి దాసులమైన మాకు విధేయ ॥జయ॥

ఇరువురు : జయ మంగళము నీకు సర్వేశ్వరా
జయ మంగళము నీకు జలజవాసినికి

(తెర వ్రాలును)

సమాప్తము

